# BHRUKTHA RAHITA TARAKA RAJAYOGI – SRI SRINIVASACHARYULU

**August 2010**

**By**

**SRI M.VENUGOPAL**

**Tirupati**

మాస్టర్ సి.వి.వి. నమస్కారము

గురుదేవ్ వి.పి.యస్. నమస్కారము

గురుదేవ్ ఎ.వి.ఎస్. నమస్కారము

## భృక్త రహిత తారక రాజయోగి - శ్రీ శ్రీనివాసాచార్యులు







మాస్టర్ సి.వి.వి. నమస్కారము
గురుదేవ్ వి.పి.యస్. నమస్కారము
గురుదేవ్ ఎ.వి.ఎస్. నమస్కారము

# భృక్త రహిత తారక రాజయోగి - శ్రీ శ్రీనివాసాచార్యులు







ప్రథమ ముద్రణ : 2010 (వికృతి నామ సం॥ శ్రావణ పూర్ణిమ)

ప్రతులు - 200 కాపీలు

రచయిత : శ్రీ ఎమ్. వేణుగోపాల్ - తిరుపతి

ప్రతులకు :

శ్రీ మునిగోటి వేణుగోపాల్

గ్రౌండ్ ఫ్లోర్,-01, శ్రీపాద హొమ్స్,

వరదరాజ నగర్, తిరుపతి - 517507.

**Author: Sri M.Venugopal**

**+918790065158**

**August 2010**

# విషయసూచిక

# CONTENTS

మాస్టర్ సి.వి.వి. నమస్కారమ్
గురుదేవ్ వి.పి.యస్. నమస్కారమ్
గురుదేవ్ ఎ.వి.ఎస్. నమస్కారమ్

శ్రీ నిరంతరానంద నిశ్రేయసార్థ
సాధకము సర్వకిల్బిష బాధకము స
మగ్ర విజ్ఞానదము మహామహిమ ఘనము
శరణమగు మాకు సద్గురు చరణయుగము

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి

# 1. భృక్త రహిత తారక రాజయోగము-పరిచయము

శ్రీ అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులు(ఏ.వి.ఎస్)గారు భృక్త రహిత తారక రాజయోగమును సాధన చేసినారు. ఈ యోగాన్నే న్యూలైన్ లేక డైరెక్ట్‌లైన్ లేక ఇండిపెండెంట్ లైన్ లేక సత్యయోగమని కూడా పేర్కొంటారు. శ్రీ శ్రీనివాసాచార్యులుగారు దీనిని మహా మనీషి, సాహిత్యసిద్ధి, యోగ సిద్ధులను పొందిన ప్రసిద్ధ పురుషులైన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి నుండి పొందినారు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు భృక్త రహిత తారక రాజయోగమును ఆరంభించిన శ్రీమాస్టరు సి.వి.వి. గారి డైరెక్టు(ప్రత్యక్ష) మీడియము.

భృక్తమనగా గుప్తమైనది లేదా ఆవృతమైనది లేదా కప్పివేయబడినది లేదా అవ్యక్తమైనది లేదా మూసివేయబడినది అని చెప్పవచ్చును. భృక్తమును పోగొట్టి తరింపజేసే రాజయోగమిది. సీమిత

1. Bhruktha Rahitha Taraka Raja Yogamu – Introduction

పదాలలో నిక్షిప్తమైన అసీమిత అర్థము ఈ మార్మిక, సాంకేతిక పదములలో ఉంది. కర్మను గురించి, అదృశ్య భూమికలును, లోకములను గురించి పదార్థము / ద్రవ్యములో అంతర్గతంగా ఉన్న ఆత్మను గురించి ఇది ప్రస్తావిస్తుంది. కుండలిని ప్రజ్ఞ ద్వారా చైతన్యావస్థలో అనగా ఎరుకతోనే దైవాన్ని భౌతికంగా సాక్షాత్కరింప చేసుకొనడము, అంతరాత్మ ప్రబోధము ద్వారా సందేహాలను నివృత్తి చేసుకొనడము, జరావ్యాధి మరణాలకు అతీతంగా ఆహారము, నీరు మొదలగువాని అవసరము లేకుండా అనగా సాధారణ ప్రకృతికి అతీతంగా భౌతిక దేహమును పరివర్తింప చేయడము, త్రిమూర్తులు, దేవతలతో నిమిత్తము లేకుండా ఆరిజన్‌తో ప్రత్యక్ష అనుసంధానము కావించుకొనడము, భిన్నత్వములో ఏకత్వమును గుర్తించి వర్తించడము, స్వయంప్రజ్ఞను పొందడము, వ్యక్తిగత సాక్షాత్కారము లక్ష్యము కాకుండా సమస్త మానవాళి అభ్యుదయము ధ్యేయముగా ఉండడము, ఇచ్ఛామాత్రసృష్టి, ఫిజికల్ ఇమ్మార్టాలిటీ(శాశ్వత భౌతిక దేహము) మొదలగువన్నీ ఈ యోగము యొక్క లక్ష్యములు.

కర్మ, కర్మ ఫలితాలను రద్దు చేయడము, విధి విధానాన్ని తప్పించడము, కాస్మాస్‌లోనూ, గ్రహాలలోను, భూమిలోను, ఈ యోగానికి అనుకూలంగా మార్పులను చేయడము మొదలగు వానిని గురించి శ్రీమాస్టరుగారు పేర్కొన్నారు.

అంతర్వలయము పరిణామ సూత్రములను గురించి, (ఇన్‌వల్యూషన్, ఎవల్యూషన్) కోర్సులు, రెగ్యులేషన్, లింక్స్, అడ్‌జస్ట్‌మెంట్స్, బ్రీతింగ్ ప్రిన్సిపల్స్ మరియు కెమికల్ ఛేంజస్(రసాయన మార్పులు), న్యూ పిట్యూటరి, న్యూ ఎర్త్ మౌల్డింగ్ ఈగో షర్బన్ కోర్సు మొదలగు వానిని గురించి కూడా మాస్టరుగారు ప్రస్తావించినారు. వీటన్నిటిని స్వయంగా తాను, మీడియముల ద్వారాను ప్రయోగాలు జరిపి వాని ఫలితాలను నమోదు చేసారు.

1910లో భూమికి దగ్గర వచ్చిన హేలిస్ తోకచుక్కకు, మాస్టరుగారి యోగానికి చాలా దగ్గర మార్మిక సంబంధముంది. ట్రాన్స్ మీడియముల ద్వారా, భూమికలను గురించి మాస్టరుగారు అపూర్వంగా విషయసేకరణ జరిపినారు. కొన్నిసార్లు ముఖ్య మీడియములకు దివ్యదృష్టినిచ్చి వారు పరికించునట్లు చేసినారు. మాస్టరుగారి యోగసాహిత్యములో వశిష్టుడు, గౌతముడు, మైత్రేయ మొదలైన మహాత్ములతో ఈ యోగానికి సన్నిహిత సంబంధమున్నట్లు ప్రస్తావించబడింది.

ఈ యోగము కొన్ని విషయాలలో సంప్రదాయ పద్ధతులకు పూర్తిగా భిన్నంగా ఉంటుంది. ఇందులో కుండలిని పైనుంచి అనగా సహస్రారము నుండి పనిచేయుట ఆరంభిస్తుంది. సంప్రదాయ పద్ధతులలో కుండలిని పనిచేయుట మూలాధారము నుండి ఆరంభ

మౌతుంది. ఈ యోగములో సాధకుడు ఏదైనా ఆహారము స్వీకరించి మాత్రమే సాధన ఆరంభించాలి. ఖాళీకడుపుతో యోగసాధన ఆరంభించ కూడదు. ఇది ప్రవృత్తి మార్గము, సన్యాసము పనికిరాదు. సౌఖ్యముండ వలెను. ఇవన్నియు సంప్రదాయ రీతులకు భిన్నమైనట్టివి. సాధకులలో విశ్వాసము నెలకొల్పే బాధ్యతను మాస్టరుగారే స్వీకరించారు. బిలీఫ్ విత్ రిలీఫ్ అని ఆయన పేర్కొన్నారు. ఉపశమనముతో విశ్వాసమని దీని భావము. మన సాధన సమయమును, సాధన విధానమును మాస్టరుగారి శక్తియే నిర్దేశిస్తుంది. ప్రార్థనకాగానే కనులు వానియంతట అవే తెరచుకుంటాయి. సాక్షీభూతంగా మనలో జరుగు చర్యను మనము గమనించాలి.

మాస్టరుగారి అనుగ్రహము, యోగముపట్ల భక్తి, శ్రద్ధ, తత్పరత, నియత సాధన మంత్ర, తంత్ర, యోగములలోనూ, విజ్ఞానము, అనాటమీ, వైద్యము, వేదాంతము మొదలగు వానిలో తగినంత అవగాహన ఉంటే మాత్రమే మాస్టరుగారి యోగమును గురించి కొద్దిగాయైనా తెలుస్తుంది. నిర్మలమైన చిన్నబిడ్డలవలె అమాయకంగా మాస్టరుగారిని నమ్మి, సర్వదా సమర్పణ చేసుకొన్న అదృష్టవంతులైన సాధకులు యోగములో త్వరత్వరగా పురోగమిస్తారు. పరమార్థ కుతూహలత్వము కలిగి సత్య,ధర్మ,వివేకములను గుర్తించు కొనుచు అంతరాత్మ ఆరాధనతో సాధన కొనసాగించాలి.

మౌతుంది. ఈ యోగములో సాధకుడు ఏదైనా ఆహారము స్వీకరించి మాత్రమే సాధన ఆరంభించాలి. ఖాళీకడుపుతో యోగసాధన ఆరంభించ కూడదు. ఇది ప్రవృత్తి మార్గము, సన్యాసము పనికిరాదు. సౌఖ్యముండ వలెను. ఇవన్నియు సంప్రదాయ రీతులకు భిన్నమైనట్టివి. సాధకులలో విశ్వాసము నెలకొల్పే బాధ్యతను మాస్టరుగారే స్వీకరించారు. బిలీఫ్ విత్ రిలీఫ్ అని ఆయన పేర్కొన్నారు. ఉపశమనముతో విశ్వాసమని దీని భావము. మన సాధన సమయమును, సాధన విధానమును మాస్టరుగారి శక్తియే నిర్దేశిస్తుంది. ప్రార్థనకాగానే కనులు వానియంతట అవే తెరచుకుంటాయి. సాక్షీభూతంగా మనలో జరుగు చర్యను మనము గమనించాలి.

మాస్టరుగారి అనుగ్రహము, యోగముపట్ల భక్తి, శ్రద్ధ, తత్పరత, నియత సాధన మంత్ర, తంత్ర, యోగములలోనూ, విజ్ఞానము, అనాటమీ, వైద్యము, వేదాంతము మొదలగు వానిలో తగినంత అవగాహన ఉంటే మాత్రమే మాస్టరుగారి యోగమును గురించి కొద్దిగాయైనా తెలుస్తుంది. నిర్మలమైన చిన్నబిడ్డలవలె అమాయకంగా మాస్టరుగారిని నమ్మి, సర్వదా సమర్పణ చేసుకొన్న అదృష్టవంతులైన సాధకులు యోగములో త్వరత్వరగా పురోగమిస్తారు. పరమార్థ కుతూహలత్వము కలిగి సత్య,ధర్మ,వివేకములను గుర్తించు కొనుచు అంతరాత్మ ఆరాధనతో సాధన కొనసాగించాలి.

ఈ యోగమును గురించి మాస్టరుగారి డైరీలోనూ, నోట్సులలోనూ, మాహాత్మా సంపుటములలోనూ, ప్రజ్ఞాప్రభాకరము, ప్రభాకర ప్రవచనములోనూ, శ్రీ ప్రభాకరమిత్రమండలి ప్రచురణల లోనూ, యోగా ఫ్రెండ్స్ సొసైటీ వారి ప్రచురణలలోనూ విస్తారంగా విపులంగా ఉంది. జిజ్ఞాసువులు వానిని పరిశీలించమని ప్రార్థన.

సమస్త మానవజాతి యొక్క సకల సమస్యలకు సర్వబాధా నివారణోపాయమై(పెనీసియా) మానవజాతి పరమగమ్యానికి, సృష్టి సాఫల్యతకును, శ్రీ నిరంతరానంద నిశ్రేయ సార్థ సాధనమునకై, సాధారణ మానవాళికి అందుబాటులో ఉన్న సులభతర ఉపాయము ఈ యోగము అని నా ప్రగాఢ విశ్వాసము. దీనికి వెల=శ్రద్ధ, ఫలము=అసీమితము, అనంతము, నిత్యానందము ఆరోగ్యము మరియు విశేష ప్రజ్ఞ. లోకకల్యాణ కారకులైన సకల మహాత్ముల చరణాలనంటి సమస్త మానవాళి హృదయాలలో ఈ యోగసాధన అభీప్సను మరింత జాగృతము చేయాలని ప్రార్థిస్తున్నాను.

యోగసాధనలో ఉన్నత స్తరాలకు తీసుకెళ్ళడానికి, సాధనలోని అడ్డంకులను తొలగించుకొనడానికి, ఉత్తమ యోగ్యత పొందడానికి యోగలక్ష్య సాధనకు సిద్ధము కావడానికి ఈ రచన అధ్యయనం ఉపయోగపడేటట్లు చేయమని శ్రీ మాస్టరుగారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, పూజ్య గురుదేవులు శ్రీ ఏ.వి.ఎస్. గారిని ఇతర

మహాత్ములను, గురుతుల్యులైన వారిని, సమాన సాధారణ లక్ష్యము గల ఘన విభూతుల పాదములనంటి ప్రార్థిస్తున్నాను.

ఈ రచన శ్రీ అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యుల గారిని గురించి ఇతర రచనలకు ప్రేరణ కావాలని, ఆ మహానుభావుని ద్వారా ఇతరులు పొందిన స్ఫూర్తి, ప్రేరణ, లబ్ధి మొదలైనవానికి ప్రత్యక్ష ప్రమాణాలైన అనుభవాలు గ్రంథస్థము కావడానికి దోహదపడాలని మాస్టరుగారి యోగవ్యాప్తికి ఉపయోగపడాలని నా ప్రగాఢ ఆకాంక్ష.

## 2. శ్రీ శ్రీనివాసాచార్యులుగారు

శ్రీ శ్రీనివాసాచార్యులుగారు సరళ స్వభావులు. సరస స్వభావులు. అయితే కుసుమాదపి కోమలం. వజ్రాదపి కఠోరం అనునది కూడా వారిపట్ల అన్వయిస్తుంది. తల్లిదండ్రులతోగానీ, భార్యతో గానీ, స్నేహితులతోగానీ లేక ఇతర హితులతో, సన్నిహితులతో కూడా పంచుకోలేని సమస్యలు మనము ఆయనతో విన్నవించుకొని, సాంత్వన పొందిఉంటాము.

అసాధారణ వ్యక్తులను గురించి, లోకాతీత వ్యక్తులను గురించి, పరమ దయాళువులైన వారిని గురించి కథలలో విని ఉంటాము. అయితే అటువంటి మహోన్నత వ్యక్తుల సంపర్కము మనకు ప్రత్యక్షంగా అనుభవమైందంటే అది జన్మ, జన్మల పుణ్యఫలము. ఇతరుల

**2. Sri Srinivasacharyulu**

బాధలను,కష్టాలను తనివిగా చేసుకొని, వానిని ప్రార్థనల ద్వారా ఆయన పరిష్కరించిన తీరుమనము ఎప్పటికి మరువలేము. ఇది ఏదో తాత్కాలికంగా ఒకటి, రెండువిషయాలు కాదు. దశాబ్దాలుగా అకుంఠిత దీక్షాతత్పరతతో, నిస్వార్థముతో వేళవేళలలో యోగదృష్టితో ఆరు దశాబ్దాలకు పైగా ఆ మహానుభావుడు సాగించిన యోగతపస్సు అసాధారణమైనది. భక్తి, జ్ఞాన, కర్మ, మంత్ర, తంత్ర యోగముల సారములను కలుపుకొని, వానికన్నిటికన్న అతీతంగా, విశిష్టంగా, ఉత్కృష్టంగా భృక్త రహిత తారక రాజయోగము విలసిల్లితే అట్టి భృక్త రహిత తారక రాజయోగములో ఆదర్శయోగిశ్రీశ్రీనివాసాచార్యులుగారు.

రెండున్నర దశాబ్దాలుగా నాకు, ఆయనతో పరిచయము. నా జీవితములో అవి మంగళ, సువర్ణ ఘడియలు. అవి చెరగని మాయని మధురస్మృతులు, శ్రుతులు. ఆయన ఒక వ్యక్తి కాదు. ఒక మహా సంస్థ. మహానుభావుల దయతో, భగవదనుగ్రహముతో అనుమతించిన మేరకు వారిఘనత తెలుస్తుంది. అంతరంగములో ఇంద్రియాతీతానుభూతులు అనుభవములోనికి వస్తాయి. "మనము ప్రార్థన ద్వారా మన విన్నపాలను భగవంతునికి తెలియపరుచుకుంటే భగవంతునికి మహిమల ద్వారా మనతో మాట్లాడుతాడ"ని శ్రీ అరవిందులు సెలవిచ్చారు. ఎంతోమంది సాధకులకు ఇలాంటి అద్భుతమైన అతీంద్రియానుభవములను, దైవసాన్నిధ్యమును

అందించిన మహానుభావుడు శ్రీ ఆచార్యులుగారు.

ఈ పంక్తులు వ్రాస్తుంటే పోతన భాగవతములోని ఈ పద్యము స్ఫురణకు వస్తున్నది. "భాగవతమని తెలిసి పల్కుట చిత్రము శూలికైన దమ్మి చూలికైనా విబుధ జనుల వలన విన్నంత, కన్నంత తెలియవచ్చినంత తేటపరుతు". గురుదేవుల చరిత్రలట్టివి.

మహానుభావులను గురించిన మధుర స్మరణ, స్మృతులు మన చైతన్యమును ఉద్దీపింప చేస్తాయి. ఊర్ధ్వగతికి తీసుకెళ్ళుతాయి.

శ్రీ ఆచార్యులు గారిని గురించి కృతజ్ఞతా పూర్వకముగా తరచు స్మరించుకొనడము మనిషిగా నా కనీస కర్తవ్యమనుకుంటాను.

ఆచార్య తిరుమలగారు శ్రీ ఆచార్యులను గురించి వ్రాస్తూ "ఆయన పనిని, మాటను, నడవడిని, చర్యలను, ప్రతిచర్యలను హావభావములను, సాక్షీభూత తత్త్వమును, ఇతరుల కష్టాలతో మమేకమగుటను ఆర్తులపట్ల తపనను, యోగమిత్రులు, వారి బంధువులపట్ల అవ్యాజప్రేమ తొణికిసలాడడము, ఆయనను గమనించడము, పరిశీలించడములో ఎంతో గుణపాఠములు ప్రత్యక్షంగా ప్రకటితమౌతుంటాయి. ఇలా ప్రవర్తించాలని ప్రయోగాత్మకంగా చూపుతుంటాయి." అన్నారు.

జీవన సాఫల్యతకు, బ్రతుకు ధన్యత చేసుకొనుటకు యోగ

వికాసానికి, స్ఫూర్తికి, ప్రేరణకు ఈ రచన ఉపయోగపడాలని గురుదేవులను, దైవమును పాదములనంటి ప్రార్థిస్తున్నాను. అపశబ్దములు ఉన్నప్పటికీ హరినామస్మరణ పుణ్యకారకమని భాగవతోత్తములు సెలవిస్తారు. బిడ్డల చిట్టి చిట్టి అల్లి బిల్లి పలుకులు తప్పటడుగులు తల్లిదండ్రులకెంతో ఇష్టము. అలాంటిదే గురువాత్సల్యము అని నేను భావిస్తాను.

మహాత్ముల జీవితాలు అనంత చైతన్య సాగరాలు. అందులో ఒక తరంగము కొంచెంగా మనకు కన్పడుతుంది.

కనబడనిది, తెలియనిది అనంతమైనది కొండంతలో వ్యక్తమయ్యేది కుండంత. చాలా మంది గురువులు తమనుతాము ప్రకటించు కొనుటకు ఇష్టపడరు. అందులో సార్(శ్రీ ఆచార్యులుగారు) ఒకరు. ఆ మహానుభావునికి తగిన ఇల్లాలు శ్రీ అమ్మగారు. ఎంతోమంది యోగసాధకులుసొంతబిడ్డల కన్న అధికంగా వారి అవ్యాజ వాత్సల్యమును చవిచూసారు. నీడ లాగా సార్ వెనుక సార్ మనసెరిగి సమయానికి నిర్దిష్టంగా వ్యర్థము లేకుండా ఏర్పాట్లు చేయడములో ఆమెది అందవేసిన చేయి. తెర వెనుక ఉండి పనులన్నిటిని సాధకులా సౌకర్యాలను అమర్చే అమ్మ ఆమె. కొన్ని ట్రీట్‌మెంట్ విషయాలతో సార్‌కు ఒక ఉపకరణముగా ఎన్నో సంవత్సరాలు శాంతంగా, ఓరిమితో సహనముతో ఇబ్బందులను అనుభవించిన తపస్విని ఆమె.

ఇద్దరు ఘనమైన జోడి. గృహస్థాశ్రమములోని ఆదర్శ రాజయోగులు. ఈ రచనలో శ్రీనివాసాచార్యులుగారిని అక్కడక్కడ శ్రీ ఆచార్యులుగారనీ, గురువుగారనీ, సీసాగారనీ, శ్రీఏ.వి.ఎస్. అనీ, సార్ అని కూడా పేర్కొనుట జరిగింది. ఎందుకంటే యోగమిత్రులు, తదితరులు ఆయనను అలా సంబోధిస్తూ ఉండేవారు.

మన యోగ్యత, శక్తి, సామర్థ్యాల ననుసరించి ఇతరులను అంచనా వేస్తాము. చాలాసార్లు ఇతరుల లోపాలను ఎంచడము సాధారణ మనుషులు చేసే పని. అయితే సాధకులకు ప్రత్యేకించి శిష్యులకు గురువుపట్ల ఇట్టి ధోరణిని అవలంబించడము మంచిదికాదనుకుంటాను. ఒకసారి శ్రీ రామకృష్ణ పరమహంస వద్దకు ఒక వ్యక్తి వచ్చి తన గురువులో తాను గమనించిన లోపాలను గురించి అదేపనిగా వివరించసాగాడు. పరమహంస కొద్దిసేపు విని ఆ తర్వాత ఆ వ్యక్తిని గురువు వద్దకు నివు ఎందుకెళ్ళావని అడిగాడు. అప్పుడు ఆ వ్యక్తి తన గురువులోని ఉదాత్త గుణములను గురించి, ఘనతను గురించి విని ఉన్నతంగా ఎదగాలనుకొని వెళ్ళినానని అన్నాడు. అయితే నీవు వెళ్ళిన పనిపై శ్రద్ధ ఉంచి తదితరములను వదిలి బాగుపడమని ఆయనకు సలహా ఇచ్చాడు. ఇది సాధకులందరికీ ఉపయోగపడే విలువైన సలహా. మహాత్ముల చర్యలు కొన్నిసార్లు పైకి అసంగతంగా కన్పిస్తాయి. ఎల్లప్పుడు అంతరాత్మ ప్రబోధానికి కట్టుబడి వారి జీవన సరళి మాటలు

చర్యలు కాలప్రమాణానికి తట్టుకొని నిలుస్తాయి. అవి ఉన్నత నిబంధనలకు లోబడి ఉంటాయి. మహాత్ముల చర్యలు మార్మికంగా సింబాలిక్‌గా ప్రతీకాత్మక ధోరణిలో ఉంటాయి. అసీమితమైనది వ్యక్తమైనప్పుడు ఇలాగే ఉంటుంది. అంతర్ముఖంగా తగినంత విస్తృతి, గాఢత, లోతు ఉంటేగాని మహాత్ముల చర్యలు అర్థముకావు.

పునరుక్తి దోషమును, రచన నిర్ణీత క్రమములో వ్యవస్థ పూర్వకంగా లేకపోవుటను శ్రీ ఆచార్యులగారి వ్యక్తిత్వమును గురించి చాలినంతగా వివరించలేని నా యోగ్యతా లోపాన్ని పెద్దమనసుతో మన్నించమని, రచన వెనకున్న స్ఫూర్తిని, తపనను అర్థము చేసుకొనుమని గుణగ్రహీణ పారాయణులైన పాఠకులను ప్రార్థిస్తున్నాను.

## 3. మంగళగిరి ఉదంతము

అది **12**, మే **1993**వ సంవత్సరం. బహుశా బుద్ధపూర్ణిమ అనుకుంటాను. శ్రీ సత్యనారాయణగారు పోలీసు డిపార్టుమెంటులో పనిచేస్తుండేవారు. మంగళగిరి పోలీసు క్వార్టర్సులో ఆయన నివాసము. సాయంకాలము ప్రార్థనకై ఇంటికి రమ్మని శ్రీవారిని ఆహ్వానించారు. మేమంతా కారులో ఆయనతోపాటు వెళ్ళినాము. ప్రార్థన ముగిసింది. సాయంకాల సమయము. వెలుపలికి వచ్చినాము. కారు ఆరుబయట పార్కు చేయబడి ఉంది. చుట్టూ రకరకాల చెట్లు. మా బృందము

**3. Mangalagiri Incident**

ఇరవై నుండి ఇరవై ఐదు వరకు ఉంటుంది. చిన్న, చిన్న గుంపులుగా చేరి మాట్లాడుకుంటున్నాము. హఠాత్తుగా తీవ్రంగా గాలి వచ్చింది. చెట్టుకొమ్మలు విరిగి పడ్డాయి. అయితే తమాషా ఏమంటే ఇంతమందిలో ఎవ్వరికీ తగలకుండా, కారుకు తగలకుండా మనుషులకు, కారుకు మధ్యలో ఉండునట్లుగా ఎవ్వరో పట్టుకొని దింపినట్లుగా విరిగి పడినాయి. ప్రత్యక్షంగా అక్కడ ఉన్నవారికి ఆ సంఘటన ఎంత తీవ్రసమస్యలను సృష్టించగలదోఅర్థమైంది. మాస్టరుగారి దివ్యానుగ్రహముచే పెనుసమస్య ఎగిరి పోయిందని శ్రీఆచార్యులుగారు సెలవిచ్చారు.

## 4. శ్రీ నారాయణరావు నెల్లూరు న్యాయవాది సెలవిచ్చినది - సీ.సా. గారి దివ్యదృష్టి

ఆగస్టు నెలలో మాస్టరుగారి జన్మదిన నక్షత్రము ధనిష్ఠ ఒకరోజు వ్యవధితో శ్రీగురుదేవులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కనుమరుగైనరోజు కలసివస్తుంటాయి. నాకు తెలిసే(1980.వ.సం॥రం నుండి) ఆ రోజులలో రమారమి 150 నుండి 250 వరకు సాధకులు శ్రీ ఆచార్యులుగారి ఇంటిలో సమావేశమయ్యేవారు. మూడు రోజులు పూర్తిగా ఆ గృహప్రాంగణములోనే ఆధ్యాత్మిక శిబిరములాగా గడిపేవారము. నిజంగా అవి చెదరని మధుర స్మృతులు. సువర్ణదినాలు.



**4. Sri Narayana Rao's Narration – SI.SA's Divine Vision**

సాధారణ ప్రార్థనలు, రోగనివారణ ప్రార్థనలు, మాస్టరుగారి యోగసాహిత్యముపై చర్చలు, శ్రీఆచార్యులు గారి యోగానుభవాలు, వారి గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారితో ఆయన గడిపిన రోజులు, సంఘటనలు, యోగమిత్రుల అనుభవాలు, యోగ విషయాలును, వివిధ ట్రీట్‌మెంట్ కేసులను మాస్టరుగారి యోగ, ఆధ్యాత్మిక విషయాలను గురించి చర్చలు, మాట్లాడుట మొదలగు వాటితో తెలియకుండగనే కాలము గడిచేది. కాఫీలు, ఫలహారాలు, భోజనాలు, కాలకృత్యములు, విశ్రాంతి, నిద్ర అన్ని కూడా ఆ ప్రాంగణములోనే. ఆ సమయంలో కలిసిన **150** నుండి **250** మంది వరకు అందరూ ఎంతో ఆప్యాయంగా, ప్రేమతో సన్నిహిత బంధువులకన్నా, స్నేహితులకన్నా మిన్నగా మసలుకొనేవారము. కావాల్సిన ఏర్పాట్లు చకచక జరిగిపోయేవి. అట్టి సందర్భములో ఒకసారి మేడపైన శ్రీ ఆచార్యులుగారు, శ్రీవీరారెడ్డి(యోగమిత్రులు)గారి బృందముతో కలిసి విద్యుత్ బల్బులు, ట్యూబ్‌లైట్లను ఏర్పాటు చేయడములో తలమునకలై ఉన్నారు. క్రింద కూటమి(హాలు)లో మేము అప్పుడు శ్రీనారాయణరావుగారిని కలిసి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిని గురించి, శ్రీ ఆచార్యులుగార్లను గురించి వారికి తెలిసిన కొన్ని విషయాలు చెప్పమని కోరినాము. అప్పుడు ఆయన చెప్పిన విషయమిది.

"శ్రీ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ ఆచార్యులుగారితో కలిసి ఒకరికి ట్రీట్‌మెంట్(ఆస్ట్రల్ కేసు) విషయమై **1945-46** మధ్యకాలము కాబోలు నెల్లూరికి వచ్చారు. ఈ కేసు నయమైన తర్వాత ఒక స్నేహితుని(యోగ మిత్రుని) ఇంటిలో శ్రీశాస్త్రిగారు ఆయన స్నేహితులు, హితులు, శిష్యులు సమావేశమై మాట్లాడుకుంటున్నారు.

ఇంతలో ఒకాయన తన కూతురిని తీసుకొని వచ్చినారు. విషయమేమమి విచారిస్తే తనకూతురు రెండు, మూడురోజుల నుండి తొడనొప్పితో గిలగిలలాడి పోతున్నదని, డాక్టరు వద్దకు తీసుకుపోయి నామని, ఎక్స్-రేలు అయినాయని, మందులు వాడినామని, కాని గుణం కన్పించలేదని వాపోయినాడు. శాస్త్రిగారు అందరిని కూచుని ప్రార్థన చేయమని కోరినారు. ప్రార్థన ముగిసిన తర్వాత ఒక్కొక్కరిని వారికి ఏమన్పించిందని వాకబుచేసారు. చాలామంది తమకేమి అన్పించలేదని చెప్పినారు. సీ.సా. గారి వంతు వచ్చింది. ఆయన "సార్! ఈ అమ్మాయి కొన్నిరోజుల క్రితము టెన్నికాయిట్ ఆడుచున్న దృశ్యము కన్పించింది" అని చెప్పినారు. శ్రీశాస్త్రిగారు "తర్వాత ఏమిటి?" అని ప్రశ్నించారు. "ఎదురుగా ఆడేవారు రింగును గట్టిగా విసిరినారు. ఈ అమ్మాయి దానిని సరిగా అందుకోలేక పోయింది. రింగు వచ్చి చాలాబలంగా ఆమె తొడపై పడింది. ఈమె తొడలోపల ఎముకపై వెంట్రుకవాసిలో చీలిక(విరగడము) అయ్యింది. దీనివలననే ఈ

అమ్మాయికి తొడనొప్పి" అని తేల్చి చెప్పారు. విచారిస్తే అది సత్యమని తేలింది. "ఆ అమ్మాయికి ఆ సమయములో అప్పుడు నొప్పి తెలియకపోయినా తర్వాత కొంతసేపటి నుండి సమస్య ఆరంభమైంది. ఈ వెంట్రుకవాసి చీలిక మామూలు ఎక్స్-రే లో తెలియదని డీప్ ఎక్స్-రేలో దీనిని పరీక్షించమ"ని సీ.సా.గారు సెలవిచ్చారు. విస్తుపోవడము అక్కడి మిత్రులవంతైతే, లోలోపల ఆనందించడము శ్రీ శాస్త్రిగారి వంతైంది.

## 5. ట్రీట్‌మెంట్

ఒకసారి కోస్తా ప్రాంతమువారు హైదరాబాదులో వైద్యవిద్య చదువుచున్న అమ్మాయిని తీసుకొని వచ్చినారు. అది పెద్ద ఆస్ట్రల్‌కేసు. ఆస్ట్రల్‌ను వాడుకభాషలో దయ్యాలంటారు. అయితే వ్యక్తి ఆస్ట్రల్ అన్నప్పుడు సూక్ష్మశరీరము లేక వైటల్ లేక ప్రాణశరీరమని కూడా వ్యవహరించబడుతుంది. అమ్మాయి తండ్రి ఎరువుల కంపెనీలో మేనేజరు. శ్రీ ఆచార్యులుగారి ఘనత ఏమిటంటే రోగుల వివరాలను, వ్యాధులను చాలా గోప్యంగా ఉంచేవారు. యోగదృష్టిలో సమస్తము తెలిసినప్పటికీ ఏమీ తెలియని వారివలె ఉండేవారు. బహుశా శ్రీ మాస్టరుగారి నిబంధనల ప్రకారము రోగ వివరాలను బయటపెట్టేవారు కాదనుకుంటాను. ఒకసారి ఈ విషయమై ప్రస్తావిస్తే సత్యాన్ని

**5. Treatment**

అంగీకరించడానికి చాలా ధైర్యము కావాలని అందరికి అట్టి యోగ్యత ఉండదని అన్నారు. అంతేగాకుండా రోగ నివారణలో తన ఘనత ఏమీలేదని, తాను మందు తీసుకొనడానికి ఉపయోగపడే స్పూనులాంటివాడినని, మాస్టరుగారి ప్రార్థనాలయమునకు కాపలా కాచేలాంటివాడినని, ఘనత అంతా మాస్టరుగారికి, శ్రీ గురుదేవులు వి.పి.ఎస్. గారికి దక్కుతుందనేవారు. ఎవ్వరైనా మాస్టరు గారికి తమ సమస్యలను దాచిపెట్టుకోకుండా జరిగినది జరిగినట్టు చెప్పి, తన తప్పులను ఒప్పుకొని నిజంగా పశ్చాత్తాపము చెందితే వారికి రిలీఫ్ (ఉపశమనము) వెంటనే దొరుకుతుందనేవారు. ఇది చాలా మంది యోగమిత్రులకు అనుభవైకవేద్యము.

నాకు తెలిసిన ఒక యోగమిత్రుడు ఎన్నో సంవత్సరముల నుండి క్రమము తప్పకుండ శ్రీవారివద్దకు తిరుపతికి వచ్చేవారు. వచ్చిన ప్రతి పర్యాయము కొన్నిరోజులు తిరుపతిలోని శ్రీఆచార్యులవారి గృహములో మకాము. ఆయనకు ఆహార పథ్యములు ఎక్కువ. బయట తిండి పడేదికాదు. ఎందుకంటే ఆయన ఆరోగ్యము సున్నితము కనుక. కొన్ని సంవత్సరములు ఈ తంతు గమనించాక నా ఉత్సాహమో, ఉబలాటమో, సానుభూతియో లేక దుడుకుతనమో ఏమో తెలియదు. ఉండబట్టుకోలేకుండ శ్రీ ఆచార్యులుగారిని, "సార్! ఇన్ని సంవత్సరముల నుండి ఎన్నోసార్లు ఈయన మీ వద్దకు వస్తున్నాడు. మీరు ఎందుకు

ఈయనకు బాగు చేయకూడదు?" అని అడిగినాను. శ్రీ ఆచార్యులు గారు తనదైన విలక్షణమైన నవ్వుతో ఇలా అన్నారు "నేను ఏమి చేసేదండి? ఆయన మాస్టరుగారి ముందు ఓపెన్ కావడములేదు. సత్యము చెప్పడము లేదు. విషయాలు దాస్తున్నారు" అన్నారు. తర్వాత విచారిస్తే తెలిసినదేమంటే ఈయనకు తెలిసో, తెలియకయో ఆస్తికి సంబంధించిన హత్యకేసుతో సంబంధముండింది. ఆయన ఆ వివరాలను గురువుగారితో చెప్పలేదు. అందుకే విషయము తెగకుండ, పరిష్కారము గాకుండ అక్కడే ఆగి పోయింది. శ్రీ ఆచార్యులుగారు, సాధారణంగా అందరిని వయస్సుతో నిమిత్తము లేకుండా 'సార్' అని సంబోధించేవారు. పెద్దవారైనా, చిన్నవారైనా ఇదే మర్యాద. నిజంగా చెప్పాలంటే ఛాతీ దగ్గరగా రెండు చేతులు జోడించి నమస్కారము చేయడము ఆయన దగ్గర నేర్చుకొన్నాను(ము). అంతకుముందు నెత్తికొట్టుకున్నట్లు కుడిచేత్తో కొట్టుకోవడము అభినందన(విషింగ్) ప్రయత్నంగా ఉండేది. చాలామందిని గమనిస్తే ఇలాగే చేస్తుంటారు. ఆనాటి నమస్కారాలను తలచుకుంటే ఇప్పుడు నాకు నవ్వు వస్తుంది. శ్రీ ఆచార్యులుగారిని ఇతరులకు పరిచయము చేయాలంటే మొదట్లో చాలా ఇబ్బందిగా ఉండేది. ఆయనను ఎలా సంబోధించాలో మాకు అర్థమయ్యేదికాదు. గురువుగారని చెప్పాలనుకుంటే ఆయన "నేను ఎవ్వరికి గురువును కాను. అందరికీ శిష్యుడనని చమత్కరించేవారు.

(ప్రిసెప్టర్) అని పిలుద్దామను కుంటే ఈయన అందరిని యోగాఫ్రెండ్స్ అని పిలిచేవారు. లేక 'సార్' అని అనేవారు ఆయన. జ్ఞానము, ఆధ్యాత్మిక ఔన్నత్యము, వ్యక్తిత్వము, గుణగణములలో, వయస్సులో ఆయన పెద్దవారు. చాలా ఉన్నతులు. ఆయన యొక్క సహజమైన నిరాడంబరత, సరళతలు ఆయనను పిల్లల నుండి పెద్దల వరకు దగ్గర చేసాయి. ప్రతి ఒక్కరూ అంటే పిల్లలు, స్త్రీలు, పెద్దపెద్ద ఉ ద్యోగస్తులు, రైతులు, వ్యాపారస్తులు, చదివినవారు, చదువురానివారు అందరూ కూడా ఆయనను తమకు మాత్రమే చాలా సన్నిహితమని భావించేవారు. అయితే అది దివ్య ప్రేమ. అవ్యాజమైన ప్రేమ, సమస్త పృథ్వీతలములో చరాచర సృష్టికి, మనుగడకు కారకుడిగా ఉంటూ దేనికీ చెందని అకర్తలాగా ఉండే వ్యక్తిత్వము ఆధ్యాత్మిక వ్యక్తులది. శ్రీ ఆచార్యులుగారు ఆకోవకు చెందినవారు. "నాకు బంధువులకన్నా యోగస్నేహితులే మిన్న. ఎవ్వరైతే మాస్టరుగారి ప్రార్థన చేసుకుంటారో వారే నాకు ఆప్తులు. మిగిలిన వారితో నా బాంధవ్యాలు అంతంత మాత్రమే. నాకు ఎవరి దయా,దాక్షిణ్యాలు అవసరములేదు. మాస్టరుగారి యొక్క మరియు మా గురుదేవులు శ్రీ శాస్త్రిగారి యొక్క ఆశీస్సులు చాలు. నేను ఎవ్వరి నుండి ఏమీ ఆశించను" అని తరచుగా చెప్పేవారు. అలాగే ప్రవర్తించేవారు. ఎంతో సరళంగా, నిరాడంబరముగా కన్పించినప్పటికీ ఆయనలో అనంతమైన విశ్వాసము, తెంపరితనము,

నిర్భయతలు, ఋజుత్వము, సహనశీలత, ఓరిమి, సత్యానికి ధర్మానికి కట్టుబడిఉండడము మొ॥గు గుణాలు ప్రస్ఫుటంగా కనబడేవి. చక్రవర్తి రాజసములాంటి ఠీవి, హాస్యస్వభావాలు ఆయన వ్యక్తిత్వములో భాసిల్లుచుండేవి. ఆయన ఎక్కడుంటే అక్కడ చురుకు, ఉత్సాహము, చైతన్యము, శాంతి, ఆనందాలు, పరహితకార్యాలు యోగతరంగాలు పెల్లుబుకుచుండేవి. ఆయనకు కొత్తలేదు, పాతలేదు. అవసరమైనప్పుడు ఎంతచొరవ తీసుకుంటారో, అవసరము లేనప్పుడు అంతేదూరముగా ఉంటారు. 'బహుశా మనలోని తపనను బట్టి, నిజాయితీని బట్టి ఆయనపై మనం ఉంచిన నమ్మకాన్ని బట్టి, మనలపై ఆయన స్పందన ఉండేద' ని నాకు అన్పించేది. అద్దములో ప్రతిబింబము లాగా ఆయన కఠిన క్రమశిక్షణవాది. చాలా, చాలా సరళ జీవనము. అంతరాత్మ ప్రబోధానుసారము అనువర్తించే వారు. ఇది ఒకొక్కసారి కొందరి యోగమిత్రులకు, ఇతరులకు మొండి వైఖరిగా, విపరీతంగా అన్పించేది. తనచర్యలు పొరబాట్లు, తప్పులు అని తెలితే తప్పు ఒప్పుకోవడానికి ఆయన సంకోచించేవారు కాదు.

ఒకసారి తిరుపతిలో హాలులో సాధారణ ప్రార్థనలైన తర్వాత వ్యక్తిగత ఆరోగ్యాలు సమస్యల పరిష్కార నిమిత్తము ప్రార్థనలు జరుగుతున్నాయి. ఆ సమయములోనే మేడపైన కూర్చొని లోకాభి రామాయణము జరుపుచున్నారు. వారు గట్టిగా మాట్లాడుకోవడము

నిర్భయతలు, ఋజుత్వము, సహనశీలత, ఓరిమి, సత్యానికి ధర్మానికి కట్టుబడిఉండడము మొ॥గు గుణాలు ప్రస్ఫుటంగా కనబడేవి. చక్రవర్తి రాజసములాంటి ఠీవి, హాస్యస్వభావాలు ఆయన వ్యక్తిత్వములో భాసిల్లుచుండేవి. ఆయన ఎక్కడుంటే అక్కడ చురుకు, ఉత్సాహము, చైతన్యము, శాంతి, ఆనందాలు, పరహితకార్యాలు యోగతరంగాలు పెల్లుబుకుచుండేవి. ఆయనకు కొత్తలేదు, పాతలేదు. అవసరమైనప్పుడు ఎంతచొరవ తీసుకుంటారో, అవసరము లేనప్పుడు అంతేదూరముగా ఉంటారు. 'బహుశా మనలోని తపనను బట్టి, నిజాయితీని బట్టి ఆయనపై మనం ఉంచిన నమ్మకాన్ని బట్టి, మనలపై ఆయన స్పందన ఉండేద' ని నాకు అన్పించేది. అద్దములో ప్రతిబింబము లాగా ఆయన కఠిన క్రమశిక్షణవాది. చాలా, చాలా సరళ జీవనము. అంతరాత్మ ప్రబోధానుసారము అనువర్తించే వారు. ఇది ఒకొక్కసారి కొందరి యోగమిత్రులకు, ఇతరులకు మొండి వైఖరిగా, విపరీతంగా అన్పించేది. తనచర్యలు పొరబాట్లు, తప్పులు అని తెలితే తప్పు ఒప్పుకోవడానికి ఆయన సంకోచించేవారు కాదు.

ఒకసారి తిరుపతిలో హాలులో సాధారణ ప్రార్థనలైన తర్వాత వ్యక్తిగత ఆరోగ్యాలు సమస్యల పరిష్కార నిమిత్తము ప్రార్థనలు జరుగుతున్నాయి. ఆ సమయములోనే మేడపైన కూర్చొని లోకాభి రామాయణము జరుపుచున్నారు. వారు గట్టిగా మాట్లాడుకోవడము

నిర్భయతలు, ఋజుత్వము, సహనశీలత, ఓరిమి, సత్యానికి ధర్మానికి కట్టుబడిఉండడము మొ॥గు గుణాలు ప్రస్ఫుటంగా కనబడేవి. చక్రవర్తి రాజసములాంటి ఠీవి, హాస్యస్వభావాలు ఆయన వ్యక్తిత్వములో భాసిల్లుచుండేవి. ఆయన ఎక్కడుంటే అక్కడ చురుకు, ఉత్సాహము, చైతన్యము, శాంతి, ఆనందాలు, పరహితకార్యాలు యోగతరంగాలు పెల్లుబుకుచుండేవి. ఆయనకు కొత్తలేదు, పాతలేదు. అవసరమైనప్పుడు ఎంతచొరవ తీసుకుంటారో, అవసరము లేనప్పుడు అంతేదూరముగా ఉంటారు. 'బహుశా మనలోని తపనను బట్టి, నిజాయితీని బట్టి ఆయనపై మనం ఉంచిన నమ్మకాన్ని బట్టి, మనలపై ఆయన స్పందన ఉండేద' ని నాకు అన్పించేది. అద్దములో ప్రతిబింబము లాగా ఆయన కఠిన క్రమశిక్షణవాది. చాలా, చాలా సరళ జీవనము. అంతరాత్మ ప్రబోధానుసారము అనువర్తించే వారు. ఇది ఒకొక్కసారి కొందరి యోగమిత్రులకు, ఇతరులకు మొండి వైఖరిగా, విపరీతంగా అన్పించేది. తనచర్యలు పొరబాట్లు, తప్పులు అని తెలితే తప్పు ఒప్పుకోవడానికి ఆయన సంకోచించేవారు కాదు.

ఒకసారి తిరుపతిలో హాలులో సాధారణ ప్రార్థనలైన తర్వాత వ్యక్తిగత ఆరోగ్యాలు సమస్యల పరిష్కార నిమిత్తము ప్రార్థనలు జరుగుతున్నాయి. ఆ సమయములోనే మేడపైన కూర్చొని లోకాభి రామాయణము జరుపుచున్నారు. వారు గట్టిగా మాట్లాడుకోవడము

శబ్దాలు క్రింద ప్రార్థన చేసేవారికి ఇబ్బంది కల్గించాయి. సాయం కాలము ప్రార్థన అయిన తర్వాత శ్రీ ఆచార్యులుగారు దీని విషయమై తీవ్రంగా మందలించారు. ఎవరో ఆయనకు ఆ వ్యక్తులు నిజామాబాదు నుండి వచ్చినవారని చెప్పారు. అయితే నిజామాబాదు నుండి వచ్చిన యోగమిత్రులు సౌమ్యులు. క్రమశిక్షణ గలవారు. యోగముపట్ల అపార భక్తి-శ్రద్ధలు గలవారు. వారికి పై సంఘటనలతో సంబంధము లేదు. అదే విషయాన్ని ఆయన ప్రార్థన తర్వాత ప్రస్తావించాడు. వ్యక్తిగత ప్రార్థనసమయములో తాము ఎలాంటిఇబ్బంది కల్గించలేదని, వేరే వ్యక్తులు ఆ విషయాలకు బాధ్యులని వివరించారు. శ్రీ ఆచార్యులుగారు మరుసటిరోజు ప్రార్థన సమావేశమైన తర్వాత ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ నిజామాబాదు యోగమిత్రులకు బహిరంగంగా క్షమాపణ చెప్పారు. తప్పును ధైర్యంగా ఒప్పుకొనే ఔన్నత్యము ఆయనది.

## 6. సోక్రటీసు జీవితములోని ఘటనలాంటి విషయము

శ్రీకాళహస్తి దగ్గర ఉన్న గ్రామము నుండి ట్రీట్‌మెంట్‌కై ఎవరో వచ్చినారు. వారు చెప్పిన విషయము సోక్రటీసు జీవితములోని సంఘటనను గుర్తుకు తెస్తుంది.

గ్రామాలలో గ్రామదేవతలకు ప్రతి సంవత్సరం జాతర జరపడం ఆనవాయితీ. ఇలాంటివి మన దేశములోనిఅనేక గ్రామాలలో పరిపాటి.

**6. An Incident like the Event in Socrates's Life**

# 7. వైద్య విద్యార్థి ఆస్ట్రల్ కేసు

వైద్య విద్యార్థి హైదరాబాదులో మెడిసిన్ చదువుతున్నది. ఆమె ఆరోగ్యం దెబ్బతిన్నది. వైద్యపరీక్షలు జరిపితే అంతా సరిగానే ఉన్నదని రిపోర్ట్. సరే! కేసు సార్ వద్దకు వచ్చింది. యోగప్రార్థనలో విషయము తెలిసింది. అది ఆస్ట్రల్ సంబంధమైంది. ఆస్ట్రల్‌కేసులో విచారించడ మనేది కత్తిమీద సాములాంటిది. చాలామంది వీనిని విశ్వసించరు. ప్రత్యక్షంగా చూచినవారికి విషయము అర్థమౌతుంది. ఓపిగ్గా, తేలిగ్గా వానిని విచారించడము, సముదాయించడము, నచ్చ చెప్పడము, అవసరమైనపుడు తగిన సంకల్పశక్తిని లేక ఆధ్యాత్మిక శక్తిని ఉ పయోగించి దారిలోనికి తీసుకురావడము, పరిష్కరించడ మనేవి చాలా సంక్లిష్టమైనవి. సూక్ష్మమైనవి. భౌతికరూపము లేని సత్తాలతో వ్యవహరించడము విచిత్రము, విశిష్టమైన విషయము. తగిన సంకల్పశక్తి, ఆధ్యాత్మిక శక్తి, ధైర్యము కలవారు మాత్రమే ఇట్టి విషయములను డీల్ చేయగల్గుతారు. ఆస్ట్రల్‌కు శరీరముండదు. కొన్నిటికి ఇతరుల భూత, భవిష్యత్ విషయములను గురించి ఎరుక ఉంటుంది. వానిలో మంచివి ఉంటాయి. సహాయము చేసేవి ఉంటాయి. మొండివి వుంటాయి. అపకారము చేసేవి ఉంటాయి. వ్యక్తిలో తగినంత విశేష శక్తి, సామర్థ్యాలు లేకపోతే ట్రీట్‌మెంట్

**7. A Medical Student's Astral Case**

చేసేవారిని తప్పుదారి పట్టిస్తాయి. ఏడిపిస్తాయి. ఆడుకుంటాయి. అందుకే మాస్టరుగారు ఆస్ట్రల్‌కేసు విషయాలలో చాలా జాగ్రత్తగా ఉండాలన్నారు. సార్ వద్దకు ఇలాంటి కేసులు చాలా వచ్చినాయి. మెడికో విద్యార్థి చాలా కాలము తిరుపతిలో ఉంది. సరే సమస్యను వివరంగా పరిశీలించడానికో లేక అంతరాత్మ ప్రభోధాను సారమో సార్ ఆమెను కుంభకోణానికి తీసుకొని వచ్చినాడు. మాస్టరుగారి గదిలో ప్రార్థన. ఆ సందర్భములో నేను కూడా అక్కడే ఉండడము తటస్థించింది. ప్రార్థన ప్రారంభమైన కొంతసేపటికి ఆమె విచిత్రంగా ప్రవర్తించసాగింది. శరీరాన్నంతటినీ చిత్ర-విచిత్రముగా తిప్పటము ప్రారంభించింది. విచిత్రంగా ప్రవర్తించడం సాగించింది. సార్ ఆమెను కండ్లు మూసుకొనే ప్రశ్నించడం ఆరంభించారు. నీవెవరని అడిగారు. వెంటనే ఆమె నుండి తెలంగాణా ఉర్దూయాసలో తెలుగులో సమాధానమొచ్చింది. మెడికో విద్యార్థి కోస్తా ప్రాంతానికి చెందినది. బాగా చదువుకున్నది. మామూలుగా ఉన్నపుడు ఉత్తరాంధ్ర కోస్తా మాండలికముతో మంచిశైలితో స్పష్టంగా తెలుగులో మాట్లాడేది. ఇప్పుడేమో చిత్రంగా వేరే యాసలో జవాబు వస్తూందని విస్తుపోయాను. సార్ తమ ప్రశ్నలు కొనసాగించారు.

ఎప్పుడు నీవు ఈమెలో చేరావని అడిగితే సమయము, స్థలము(ప్రాంతం) చెప్పింది. సార్ ఆమెతండ్రిని అడిగితే ఆయన ఆ

స్థలములో ఆ ప్రాంతంలో బస్సుకోసము చెట్టుకింద వేచి ఉండడము నిజమని తెల్పారు. నీవు ఎందుకు ఆస్ట్రల్ అయినావని సార్ అడగగా అది ఒక లారీ ప్రమాదములో దుర్ఘటనకు గురియైన సంఘటన పర్యవసానమని తెల్పింది. ఆ లారీనెంబరు ఏమని సార్ ప్రశ్నించారు. అది నాకు తెలియదని జవాబిచ్చింది. "నీకు అది తెలుసు. నిజము చెప్పు" అని సార్ గద్దించి అడిగినారు. అప్పుడు అది చెప్పిన సమాధానము ఇప్పటికీ మనసులో స్పష్టంగా ఉంది. "ఏమయ్యా! ఆ ప్రమాదం, ఆ లారీ సంఘటన, ఆ నెంబరు అంతా కళ్ళముందు సినిమాలాగా నీవు చూస్తున్నావు కదా! విషయమంతా నీకు తెలుసు కదా! మరలా నన్ను ఎందుకు గుచ్చి గుచ్చిఅడుగుతావు?" అని చెప్పింది. "సరేలే! శ్రీ మాస్టరుగారు నాకు సైటు(దివ్యదృష్టి / యోగదృష్టి) ఇచ్చినారు. దానితో విషయము తెలుస్తుంది. నా విషయము సరే! నీకథ చెప్పు? అని అన్నారు.

సార్ ఆస్ట్రల్ చెప్పిన విషయాలను మాస్టర్‌గారిచ్చిన దివ్యదృష్టి ద్వారా చూస్తున్నారని గతములో ఎప్పుడో జరిగిన సంఘటన సినిమా రీల్ లాగా ఆయనకు కనబడుచున్నదని, ఆస్ట్రల్ చెప్పిన విషయాలను ఏకకాలంలో ఎంతవరకు సత్యమో అని గమనిస్తున్నారని, ఆయన యొక్క విశేష ప్రజ్ఞ(దివ్యదృష్టి మొ॥వి) ఆస్ట్రల్‌కు కూడా తెలిసిందని నాకు అర్థమైంది. అద్భుతాన్ని చాలా యథాలాపంగా వెల్లడించడం ఆ

మహానుభావునికే చెల్లింది.

## 8. కొన్ని అద్భుత సంఘటనలు

అలాగే ఇంకొక సంఘటన. కడుపుతో ఉన్న ఒకామె వచ్చింది. "సార్ కడుపులో ఒకరకంగా ఉంది" అంటూ తనబాధ చెప్పుకుంది. సార్ "విభూతిని కడుపుకు పూసుకో" అని చెబుతూ "ఐస్‌క్రీంలు తినడం కొంచెం తగ్గించు తల్లీ! నా కడుపంతా చల్లగా అయిపోతూంద" ని నవ్వుతూ అన్నారు. ఆమె విస్తుపోతూ తనసమస్య ఆయనలో అలా ప్రతిఫలించింది అని అనుకుంటూ కొంచెము విస్మయము, సిగ్గుతో కలసిన అనుభూతులతో తలదించికుంది. పరులు తానే అని భావించు వాడు. అతడు హరినెరిగినవాడు" అని అన్నమయ్య అంటాడు. స్వ, పర బేధములేక పోవడము ఆధ్యాత్మిక వికాసములో చాలా గొప్పఅడుగు అని అభిజ్ఞుల అభిప్రాయము.

మరియొక అద్భుత సంఘటన.

ప్రార్థన అయిన తర్వాత యోగమిత్రులు సార్‌కు నమస్కారము చేస్తు విభూది తిసుకుంటున్నారు. ఒకరు నమస్కారము చేస్తూ తన ఆరోగ్యము బాగాలేదని చెబుతున్నారు. ఆయన యోగములో చేరి కొంతకాలమైంది. సార్ సునిశితంగా చూస్తు "ఏమండీ! మీరు ప్రేయరు సరిగా చేసుకోరు. మీరు ప్రార్థన సరిగా చేసుకోలేదని మీ ఎముక



**8. Some Extraordinary Events**

నాకు చెబుతున్నది" అని అన్నారు. ఇతరుల శరీరాంతర్భాగమున ఉన్న ఎముకతో ఆయన భాషించడమంటే ఆయన సునిశిత ప్రజ్ఞ ఎంత తీవ్రమైనదో అగాథమైనదో విస్తారమైనదో సాధారణ ఊహకు అందని విషయము.

ఒకసారి బెంగుళూరులో ప్రార్థనా సమావేశాలు జరిగినాయి. వెస్టాఫ్‌కార్డురోడ్డు సమావేశములో బసవేశ్వర నగర్‌లో ప్రార్థనా స్థలము. యు.ఎస్.ఎ నుండి అంతకుమునుపు సార్‌ను సంప్రదించినవారు ఇండియాలో బెంగుళూరు ప్రార్థనాస్థలమునకు వచ్చినారు. తల్లి దండ్రులు విద్యావంతులు, ధనవంతులు కాని వారి బిడ్డది విచిత్రమైన సమస్య. ఏ ఆహారము తీసుకొన్నా పాపకు వంటబట్టడము లేదు. భోగభాగ్యాలున్న బిడ్డకు పట్టెడన్నము తినిపించలేని దుస్థితి. వైద్యనిపుణులను సంప్రదించారు. కాని ఫలితము లేదు. ఏ ఆహారము తీసుకున్నా వాంతి. తల్లి బాధ చెప్పనక్కరలేదు. బిడ్డకు మామూలు పిల్లలలాగా చాక్లెట్లు, బిస్కత్తులు అంటే ప్రీతి. కాని వానిని తీసుకొనలేదు. స్టెరాయిడ్స్‌తో కాలము నెట్టుకొస్తున్నారు. ఆ తల్లి చాలాకాలము నుండి కుమిలి పోతున్నది. తల్లీ బిడ్డ ప్రార్థనకు వచ్చినారు. సార్‌తోబాటు ప్రార్థన చేసుకున్నారు. సార్ ఆ బిడ్డ తలపైచేయి ఉంచి ప్రార్థన చేసారు. ప్రార్థన అయిన తర్వాత రసమన్నం తీసుకొని రమ్మన్నారు. సరే ఎవరో తీసుకొని వచ్చినారు.

ఆయనే స్వయముగా అన్నము, రసము కలిపి పాపకు ఒక ముద్ద తిన్పించాడు. ఎలాంటి రియాక్షన్(ప్రతిచర్య) లేదు. తర్వాత ఆ తల్లిని, బిడ్డకు అన్నము తిన్పించమన్నాడు. ముద్దు ముద్దుగా గోరుముద్దలు ఆ తల్లి తిన్పించసాగింది. ఎలాంటి ప్రతిచర్య లేదు. ప్రతిబంధకము లేదు. ఆ తల్లి పడిన ఆనందము ఇంతా అంతా అని చెప్పలేము. ఎంతోకాలము నుండి వేధిస్తున్న సమస్య చేతితో తీసిపారేసినట్లయింది. బిడ్డకు మజ్జిగ ఐస్‌క్రీమ్‌లు చాక్లెట్లు ఇవ్వవచ్చునా అని ఆమె సార్‌నడిగింది. ధారాళంగాఇవ్వమని సార్ ఆశ్వాసన ఇచ్చారు. ఎంతో కుములుతూ క్లేశముతో వచ్చిన ఆమె ఆహ్లాదంగా గలగలమని నవ్వుకుంటూ మాస్టరుగారి అనుగ్రహమును సార్ ద్వారా అనుభవిస్తూ సంతోషంగా వెళ్ళిపోయింది. అచ్చటి యోగమిత్రులంతా ఆనందపుజల్లుతో తడిసారు.

ప్రార్థనలు అయిన కొంతసేపటికి ఈనాడుకు చెందిన ఒక విలేఖరి వచ్చినాడు. సార్‌ను గురించి, యోగాన్ని గురించి విశేషాలు సేకరించినాడు. అయితే ప్రచురణలో ముద్రారాక్షసము దొర్లింది. భృక్త రహిత తారక రాజయోగాన్ని ఆయన భక్త రహిత తారక రాజయోగంగా ముద్రించారు. ఈ పొరబాటు ఎంత తీవ్రమైనదో వారికి తెలియదు. విషయమును చాలా తేలికగా తీసుకొనే స్వభావము. సరే ఇది వేరే విషయము. విలేఖరి సార్ నుండి సెలవు తీసుకొనేటప్పుడు

ప్రసాదంగా సార్ అతనికి రెండు లడ్డూలు ఇస్తూ "ఒకటి నీకు: రెండవది నీ కొడుకుకూ" అని అన్నారు. అక్కడే ఉన్న నాకు అది చోద్యమనిపించింది.

ఎందుకంటే ఆ విలేఖరిని సార్-మేము చూడడము అదే మొదటిసారి. అంతకు మునుపు ఎలాంటి పరిచయము లేదు. మరి ఈయనేమో నీకు,నీ కొడుక్కి ఈ రెండు లడ్డూలు అని నొక్కి చెప్పి ఇస్తున్నాడు కదా!అసలువిలేఖరికి పెండ్లి అయిందో లేదో, బిడ్డలున్నారో లేదో, కొడుకో కూతురోఏమో ఈ ప్రశ్నలన్నీ నా చిన్నిమనసులో తలెత్తినాయి. ఉండపట్టలేకుండాగురువుగారిని అడిగినాను. "సార్! మొదటిసారే ఈయనను చూస్తున్నారుకదా! ఆయనకు ఒకడే కొడుకున్నాడని మీకు ఎలా తెలుసు? అని అడిగాను. సార్ నవ్వుతూ "లోపలున్న పెద్దాయన చెబుతున్నాడు. కావాలంటే విలేఖరిని అడగండి" అని. విలేఖరిని అడిగితే అవునని సమాధానము. బహుశా సార్ చాలాసార్లు ఇలా అంతరాత్మ ఉద్భోధ అనుసారము అనువర్తించేవారు అని అన్పిస్తుంది.

పతితులు, దీనులు, ఆర్తులు, నిస్సహాయులపై ఆధ్యాత్మిక వేత్తులకు, మాహాత్ములకు ప్రత్యేక కరుణ ఉంటుంది. అందుకే అన్నమయ్య అంటాడు- "అయ్యా! చీకటిలో ఉండేవానికి వెలుతురు కావాలి. కాని వెలుగులో ఉన్నవానికి కాదు. ఏటిలో కొట్టుకొని

పోతున్నవానికి సహాయము కావాలి. అంతేగాని ఒడ్డున ఉన్నవానికి సహాయము అవసరము లేదు. పాపులకు నీ సహాయమెంతో అవసరము" అని ప్రక్కదారిని పట్టినవారు తప్పు తెలుసుకొని పశ్చాత్తాపము చెంది, తిరిగి అట్టి పొరబాట్లు ఇకమీదట చేయము అని మాస్టరుగారికి విన్నవించుకొని ధృఢమైన నిర్ణయము తీసుకుంటే అటువంటి వారికి సాయం చేయడానికి సార్ సదా సంసిద్ధముగా ఉండేవారు. గుంటూరు ప్రార్థనా సమావేశములోని ఒక సంఘటనను ఆయన చూచాయగా ప్రస్తావించారు. రోగనివారణ ప్రార్థనలో పాల్గొన్నవారిలో ఒకరికి ఎయిడ్స్‌వ్యాధి ఉందని, ఈయన అంతః స్ఫురణకు తోచింది. ఆ వ్యక్తిని వ్యక్తిగతంగా విచారిస్తే నిజమని తెలిసింది. అందరితోపాటి సాధారణ ప్రార్థన తర్వాత ఇతరులతో వారి వ్యక్తిగత సమస్యలను ఆరోగ్యములను గురించి చర్చిస్తున్నప్పుడు వాకబు చేస్తున్న సమయములో తన కళ్ళ లోనికి వ్యాధిగ్రస్తుడు చూస్తూ కూచుంటే వ్యాధిగ్రస్తుని ఆరోగ్యము చక్కబడుతుందని ఈయనకు లోలోపల నుండి ఉద్బోధన వచ్చింది. అదే సలహా ఇచ్చాడు. సత్వరమే సమస్య కుదుట పడింది.

కొందరు కొత్తవారైనా వారి భాగ్యవశాన ఈయనలోని దివ్యత్వమును, విశేష గుణములను టక్కున గుర్తు పట్టేవారు. ఒకసారి తిరుత్తణి నుండి ఒకసాధువు యొక్క శిష్యులు ఈయన యొక్క సలహాకై

వచ్చినారు. తిరుత్తణిలో పంచాయతీవారు మురుగుకాల్వ నిర్మాణము చేపట్టినారట. పంచాయతీవారు ప్రతిపాదించిన కాల్వమార్గములో ఈ శిష్యుల గురువు యొక్క సమాధి ఉన్నది. ఏమి చేయాలి? అన్న ప్రశ్న ఎదురైంది. విషయము సున్నితమైంది. పంచాయతీవారు సమాధిని తొలగించి తీరాలని, వేరే మార్గములేదని నిర్ధారించారట. సార్ ఆ స్థలమును సందర్శించి మొత్తం సమాధిని అడుగుపునాదితో సహా జాగ్రత్తగా పెకలించి, సమస్య లేని వేరేచోట యధాతధంగా దానిని ఉంచమని, అవసరమైతే వలసిన చిన్నచిన్న నిర్మాణములు చేపట్టమని సూచించారు.

ఈ పరిష్కారము అందరికి నచ్చింది.

వీలైనంతగా సర్దుకు పోవడము, ఇతరులకు సాధ్యమైనంత వరకు ఎలాంటి ఇబ్బంది లేకుండ చూడడము, సాధ్యమైనంత వరకు రోగ నివారణకై జరిపే ప్రయాణాలలో పొదుపు పాటించడము ఆయన పాటించేవారు. చాలా పర్యాయములు తన జేబు నుండి ఖర్చు చేసేవారు. ఆయన కారువాడుట అనేది 1995వ ప్రాంతము నుండి ఆరంభమైంది. అది కూడా యోగసాహిత్య ప్రచురణ, ట్రీట్‌మెంట్ల భారము మాస్టరుగారి గృహము యొక్క పునర్నిర్మాణము మొదలైన పనుల వత్తిడి ఎక్కువగుటచే కాలమును సర్దుబాటు చేయుటకు కారువాడుట అవశ్యకమైంది. అంతేగాక యోగమిత్రులు కూడా కారును ఉపయోగించమని సార్‌కు

పదేపదే విజ్ఞప్తి చేసేవారు. అంతకుముందు బస్సులలోని కొన్నిసార్లు లారీలలోను ప్రయాణము చేసెడివారు. ఆయన వద్ద ఒక ద్విచక్ర వాహనముండేది. దానిని ఆయన తరచుగా తానే స్వయముగా ఓవర్ ఆయిల్ చేసేవాడు. ఎలక్ట్రిసిటీ పనులు వాటర్ పంపు రిపేరి, ఇంటి నిర్మాణము, చెక్క పనులు, సమస్తము తానే స్వయముగా చూసుకొనేవాడు. ప్రతి చిన్నపనిలోను ఆయన కౌశలము స్పష్టమయ్యేది. స్టాంపు లతికించడము, దారము కట్టడము, పూలమాల వేయడము, ప్రార్థనకు జంబఖానా పరచడం మొదలగు వానినన్నిటిలో కూడా సరసత, సరళత, రసజ్ఞతలు ఉట్టిపడేవి. ఆయన వ్రాలు ముత్యాల సరాలు. పొందికగా, పంక్తి క్రమము తప్పకుండా స్పష్టంగా, అందంగా నాజూకుగా ఆయన చేతివ్రాత ఆకట్టుకొనేది. యోగా కర్మ సుకౌశలం అనే ఆర్యోక్తికి ఆయన నిలువుటద్దము. ఏ విషయములోను వ్యర్థమనేది ఆయనకు గిట్టదు. కవర్లను అతికించే బంకయైనా, చిన్న దారపు పోగైనా ఆయన సరిగ్గా సేకరించేవారు. వినియోగించేవారు. ఏ వస్తువునైనా క్రమంగా, సక్రమంగా వితరణగా ఉపయోగించడములో ఆయనది అందెవేసిన చేయి. ఆయన ఆధ్యాత్మిక పరిపక్వత ఆయనపనులలో, మాటలలో, ప్రతిస్పందనలో అది చిన్నదైనాగాని, పెద్దదైనా గానీ ప్రతి విషయములో స్పష్టంగా ముద్రించుకుని వచ్చేది. అవి యోగసాధనలో సాధకులకు సోదాహరణ పాఠాలు. మిత్రులు,

తాను అనుకున్న స్థాయికి రాకుంటే తప్పొప్పులను ఆయన సునిశితంగా చూపేవాడు. అది ఒక శిక్షణ లాంటిదని అనుకుంటాను.

మనుషుల మాటలను, ప్రవర్తనలను, హావభావాలను, చర్యలను చాలా సునిశితంగా గమనించేవారు. అటువంటి సందర్భమును తెలిపే ఒక చిన్న దృష్టాంతము.

ప్రార్థనకై యోగమిత్రులంతా హాలులో కూర్చునడానికి జంబఖానాలు, చాపలు పరిచేవారము. అవి ప్రక్క ప్రక్కన ఉండేవి. ఎప్పుడూ చాపపైన జంబఖానా రావాలి(పరవాలి). ఒకసారి అలా కాకుండా జంబఖానాపైన చాప యొక్క మిగిలిన కొన పరచబడింది. ఇంగిత జ్ఞానముండాలంటూ మందలించి పొరబాటును ఎత్తి చూపారాయన.

పూలమాలలు, పటములు లేక ఫోటోల్లో మాస్టరుగారి లేక గురుదేవులు వి.పి.యస్. గారి ముఖములను కప్పివేయకుండ అందముగా వానిని ఎలా వేయవచ్చునో ఆయన ప్రత్యక్షముగా వేసి చూపేవాడు.

అంతా తెలిసినప్పటికీ ఏమీ తెలియనట్లే ఉండేవారు. అది బాహ్యపరిశీలన శక్తియో లేక అంతరంగ యోగానుభూతియో లేక రెండింటి సంతులిత సమన్వయమో చెప్పడము చాలా కష్టము.

అవసరమైనప్పుడు స్పష్టంగా పొడిపొడి మాటలలో చెప్పవలసిన విషయమును క్లుప్తంగా సూటిగా చెప్పేవారు. ఎవరి హెూదా గాని, అంతస్థుగానీ, స్థాయిగానీ ఆయనకు లెక్కలేదు. యోగమిత్రులంతా ఒకటే అని ఆయన ఖచ్చితమైన అభిప్రాయము. యోగమిత్రులంతా ఆయన గృహమును సొంతింటిలాగానే భావించేవారు.

సార్ ఒకసారి తిరుత్తణిలో బస్టాండుకు ఏదోపని ముగించుకొని, నడుస్తూ వెళ్తున్నారట. ఆయనకు ఒక కట్టెలడిపో వ్యాపారి ఎదురైనాడట. అతనికి గురువుగారిని చూడగానే లోలోపల నుండి గౌరవభావం ఉ ప్పొంగింది. సార్‌కు నమస్కారం చేసి ఇంటికి రమ్మని ప్రార్థించినాడు. సార్ ఆయన కోరికను మన్నించి ఇంటికి వెళ్ళినారు. ఆయన తన ఇంటిలో రెండవ భార్యను పరిచయం చేసి, పళ్ళెంలో తాంబూలం, దక్షిణ ఫలములు ఇచ్చి సతీసమేతంగా సాష్టాంగ నమస్కారం చేసి ఆశీస్సులను పొందినాడు. క్రొత్త వ్యక్తిలోని నిజాయితీ కూడిన భక్తి ఈయనను ఆకట్టుకొన్నదేమో?

ఒకసారి సార్ ఇంటికి ముందర వసారాలో కూచుని పనిచేస్తూ ఏదో మాట్లాడుకుంటున్నాము. బహుశా రోడ్లు, భవనాలశాఖలో పనిచేసే అధికారి ఒకరు సార్‌ను చూద్దామని వచ్చారు. సార్ ఆయనను లోపలికి పిలిచి కూచోమని చెప్పినాడు. తర్వాత ఆయనతో "అయ్యా! మీరు వేడి-వేడిగా మంచినీళ్ళు తీసుకుంటారా లేక ఫ్రిజ్‌లోని ఐస్ నీరు

తీసుకుంటారా?" అని అడిగినాడు. సార్ ఇలా అడుగుట నాకు విచిత్రంగా తోచింది. ఎవరైనా ఇంటికి వస్తే నీళ్ళుకావాలా అని అడుగుతాము. కానీ ఇలా అడగము కదా! ఏంది ఇది అని అన్పించింది. ఉండబట్టలేకుండా వచ్చిన ఆయనను ఇలా ప్రశ్నించాను. "ఏమిటండీ! గురువుగారు మిమ్ములను ఇలా అడుగుచున్నారు. ఏమి సంగతి అని?" ఆయన ఇలా జవాబిచ్చారు-

"సార్! నాది విచిత్రమైన స్వభావము అయితే వేడివేడిగా నీళ్ళు తీసుకుంటాను. లేకుంటే చలచల్లగా తీసుకుంటాను." మరి ఈ మనిషి గురువుగారికి ఎలా తెలుసో అది వారికే ఎరుక. శాస్త్రిగారు ప్రజ్ఞాప్రభాకరములో మాస్టరుగారి దివ్యప్రజ్ఞలను ఉటంకించినట్లుగా ఆ ప్రజ్ఞ ఇక్కడ కూడా ప్రతిఫలించినట్లు నేను తలుస్తాను. ఇలా వేడివేడిగా కావాలా లేక చల్ల చల్లగా కావాలా అని సాధారణంగా అడగము కదా!

## 9. టైరు ఊడి కూడా బస్సు పయనమా?

సార్ ఒకసారి మద్రాసువైపు బస్సులో ప్రయాణము చేస్తున్నారట. ఈయన ఆలోచనలలో ఈయన ఉన్నాడట. కొద్దిసేపటికి బస్సు హఠాత్తుగా నిలిపివేయబడింది. డ్రైవరు, కండక్టర్లు కంగారు, కంగారుగా క్రిందికి దిగి టైర్లను చూస్తున్నారట! ప్రయాణికులు కొందరు దిగి

9. Bus Travel even after a Tyre was Lost?

విషయమేమిటని వాకబు చేసారట. అసలు అక్కడ ఏమి జరిగిందంటే ముందు చక్రాలలో ఒకటి ఊడిపోయి, నట్లన్నీ విడిపోయి ఉన్నాయి. చక్రము ఎక్కడ అని ఇటు అటు వెదకసాగారట. డ్రైవరు బండిని వెనుకకు త్రిప్పి మెల్లగా నడపసాగాడట. సుమారు 2 కి.మీ. వెనుకకు వచ్చాక రోడ్డుప్రక్కన ఊడిపోయిన టైరు పడి ఉన్నదట. ముందుగా ఉన్న చక్రాలలో ఒకటి ఊడిపోయి ఉన్నప్పటికి ఎలాంటి సమస్య లేకుండ ఇబ్బంది లేకుండ 2 కి.మీ. దూరం బస్సు ఎలా పయనించిందో డ్రైవరుకు అర్థముగాని విషయము. కండక్టరు జనాంతికంగా "బస్సులో ఎవ్వరో మహానుభావుడు ఉండి ఉంటాడు. ఆయన వలన మనము పెద్దగండము నుండి బయటపడినాము" అని అన్నాడట. సార్ మనసులో నవ్వుకొని మాస్టర్ గారి దివ్యలీలల్లో ఇది కూడా ఇంకొకటి అని అనుకున్నాడట.

## 10. హైదరాబాదు బస్సులో తమాషా అనుభవము

హైదరాబాదులోని రాజ్‌భవన్ ఆహ్వానము అంటే గవర్నరు గారి ప్రత్యేకత వ్యక్తిగత ఆహ్వానము ప్రకారము సార్ చాలాసార్లు వెళ్ళినాడు. అప్పటి గవర్నర్ శ్రీ అబ్రహంగారి కార్యదర్శి ద్వారా ఆయనకు, సార్‌కు పరిచయము. రాజ్‌భవన్‌లో కొన్ని విచిత్ర సమస్యలను ఆస్ట్రల్ కేసులకు సంబంధించినవారికి ఈయన పరిష్కారము



10. Funny Experience in a Hyderabad Bus

చూపించినాడట. అందువలన అప్పుడప్పుడు ఛాన్సలర్ నుండి ఈయనకు ఆహ్వానము అందుచుండేది. ప్రచారాలకు, ఆర్భాటాలకు ఆడంబరాలకు సార్ చాలా దూరము సాధ్యమైనంత వరకు గోప్యంగా వ్యవహరించేవాడు. ఈయన మకాము ఏర్పాట్లు, ప్రయాణపు ఏర్పాట్లు చాలా సరళంగా ఉండేవి. ఎవ్వరైతే తమను తాము తక్కువ చేసుకుంటారో, నమ్రతతో ఉంటారో, తోటి వారికి తోటి వానిగా(సేవకులకు సేవకునిగా) భావించుకుంటారో, అలా ప్రవర్తిస్తారో వారే యోగాట్రీట్‌మెంట్ చేయడానికి అర్హులని సార్ చెప్పేవారు. "తొండలకే తొండ నమ్మ శ్రీ పురంధర" అనే పురంధరదాసు కీర్తించాడు. అంటే భగవంతుడు దాసులకు దాసుడని అర్థము. ఎంతో మర్యాద, భక్తి ప్రపత్తులతో కానుకలతో పూలు, ఫలములతో సమాదర గౌరవమొందే, ఐశ్వర్యప్రదాత లక్ష్మీరమణుడైన ఆ హరి గర్వరహితుడు. తన భక్తులైన, ఆప్తులైన పాండవుల ఇంటిలో సేవకునివలె గుర్రములను కడిగి, వానికి గడ్డిని తినిపించిన నమ్రత స్వరూపి ఆ భగవానుడు.

అందుకేనేమో లలితా సహస్ర నామములో 'నమ్రతాయనమః' అని దేవిని స్తుతిస్తారనుకుంటాను. దైవము పట్ల పరిపూర్ణ శరణాగత భావన ఉండడము భక్తులలానేగాక పరిణిత యోగులలో కూడా ఉండడము మనము చూస్తాము.

రాజ్‌భవన్ దగ్గర 2-3 కి.మీ. దూరంలో పికప్‌స్టాప్ వద్ద ఈయన బస్సు ఎక్కినారు. ఈయనకు రిజర్వ్‌యైన సీటులో వేరేవ్యక్తి కూర్చుని ఉన్నాడు. అది కిటికీ ప్రక్కన ఉన్నది. సార్ ఆయనతో తన రిజర్వేషన్ సీటును గురించి చెప్పి వేరేచోట కూర్చోమని అన్నాడు. అయితే ఆప్పుడికే ఆ సీటులో కూర్చున్న వ్యక్తికి సంస్కారము తక్కువ.

తాను పోలీసు డిపార్టుమెంటుకు చెందినవాడిననే దర్పమెక్కువ. కండక్టర్ వచ్చి చెప్పినా కూడా లేవడానికి కర్కశంగా తిరస్కరించినాడు. సరే! కండక్టర్ గత్యంతరము లేక సార్ కు వేరే సీటు చూపించి అక్కడ కూర్చుని సర్దుకు పోమని రిక్వెస్టు చేసినాడు. ఇతర ప్రయాణికులు కూడా కండక్టరుకు సహకరించమని సార్‌ను కోరినారు. వారికి కూడా ఆ పోలీసు అధికారి తీరు రుచించలేదు. కాని మూర్ఖులతో వేగడము కష్టమని సార్‌కు చెప్పినారు. సార్ వేరే సీటులో కూర్చున్నాడు. తనతోపాటు తీసుకెళ్ళిన మాస్టరుగారి సాహిత్యమును చదువుతూ కూర్చున్నాడు.

2-3 గంటల పయనము తర్వాత సనసన్నగా వాన ప్రారంభమై ఎక్కువ కాసాగింది. తమాషాగా సార్ కూర్చున్నచోట తప్ప మిగిలిన చాలా చోట్ల వాననీళ్ళు లోపలికి రావడము ఆరంభమైంది. కిటికీ అద్దాలు సరిగ్గా లేకపోవుటచే సమస్య జటిలమైంది. సార్ రిజర్వుడు సీటులో కూచొని ఉండిన ఎస్.ఐ., సార్‌తో "అయ్యా! సీటు

మారుదామా?" అని అడిగారట. బస్సులో కండక్టరు, ప్రయాణికులు అది విని ఒకటే నవ్వట. ఆయన ఏ మొహము పెట్టుకొని ఇలా అడుగుతాడని. ఎస్.ఐ. గారు కందగడ్డ ముఖము పెట్టుకొని గుర్రు, గుర్రుగా అయినాడట. మాస్టరుగారు వాననీళ్ళతో తన యోగసాహిత్యము తడవకుండా రక్షించుకొనుటకే ఈ నాటకము ఆడించినాడని సార్ సెలవిచ్చారు.

## 11. మాంగల్యం – మంగాపురం

సార్‌తో సన్నిహితులైనవారు యోగ విషయములే కాకుండా ఆయనను తమ పెద్దదిక్కుగా భావించి తను ఇంటికి సంబంధించిన చిన్న, పెద్ద విషయాన్నింటిని వ్యక్తిగత సమస్యలను గురించి, కుటుంబములో సభ్యుల అనుబంధాలను, ప్రవర్తనను గురించి, ఉద్యోగాన్ని గురించి, ఆస్తిపాస్తులను గురించి, అది ఇది అని లేకుండా చాలా చాలా వ్యక్తిగత వైయుక్తిక విషయాలను అంతరంగికముగా కూడాముచ్చటించేవారు. గుసగుస లాడేవారు. గోడు వెళ్ళబోసు కునేవారు. ఫిర్యాదులు చేసేవారు.

అక్షరాభ్యాసమైన, నామకరణమైన, పెండ్లిచూపులైన, కల్యాణమైన, సీమంతమైన, ఉద్యోగమైనా, గృహప్రవేశమైన, ఇతరములైన ఆయనతో చెప్పి ఆయన సూచనల ప్రకారము నడుచుకోవడము

**11. Sacred Thread and Mangapuram**

**(This event describes the Marriage of Chy. Rājeswari, daughter of**

**Dr.V.Ramachandra Rao, Principal of S.V.Medical College, Tirupati)**

పరిపాటి. ఒకసారి ఒక పెండ్లి విషయమై సార్ సంబంధము కుదిర్చినారట. రెండువైపులవారు ఈయనకు తెలిసినవారు. పెండ్లికి ఈయనను ప్రత్యేకంగా ఆహ్వానించినారు. పెండ్లి సంబరాలు, సరదాలు సాగుచున్నాయి. మాంగల్యధారణ ముహూర్తము దగ్గరైంది. మాంగల్యధారణకు మునుపు మాంగల్యాన్ని అంటే మంగళసూత్రాన్ని ఆహూతుల వద్దకు తీసుకొని వెళ్ళడము, వారు నమస్కరించడము, ఆమోద సూచనంగా మంగళ సూత్రముంచిన పళ్ళెం చేతులు మారింది. మాంగల్యమును తీసుకొని పెండ్లికొడుకుకి ఇద్దామని పురోహితుడు చూస్తే, మాంగల్యము లేదు. ఒక్కసారిగా పెండ్లి దృశ్యం, హడావిడి సంరంభము, వేడుకలు, ఉత్సాహాలు, చప్పగా చల్లారి పోయినాయి. రసాభాస, గందరగోళము, మగపెళ్ళివారు ఢీలా పడిపోయినారు. ఆడ పెండ్లివారికి దిక్కుతోచని స్థితి. ఏమి చేయాలో పాలు పోవడములేదు. అందరూ హడావుడిగా మాంగల్యమును వెదక సాగినారు. ఏమీ ప్రయోజనము కన్పించలేదు. మగపెండ్లివారి బృందములో కొందరు ఇది మంచి శకునము కాదని గుసగుస లాడినారు. సనసన్నగా సన్నాయి నొక్కులు బయట పడినాయి. పెండ్లి అసలు జరుగుతుందో లేదో అనే సమస్య ప్రారంభమైంది. ఆడపెండ్లివారి పరిస్థితి దయనీయంగా మారింది. తాను మధ్యవర్తిలా వ్యవహరించినఈ పెండ్లిస్థితి ఇలా అయ్యిందేమని సార్ సతమతం కాసాగారు.

"మాస్టర్ మహాప్రభో! సహాయం చేయండి" అని అనుకుంటూ కనులు మూసుకొని తపనతో ప్రార్థన చేసారట. ఎవరో కొంచెము వెటకారంగా శ్రీనివాసాచార్యులు ఇక్కడ కూడా యోగనిద్ర పోతున్నారా! అని వ్యంగ్యం విసిరారట. మాంగల్యమున్న స్థలము సార్ యొక్క యోగదృష్టికి స్పష్టంగా కనబడింది. వెంటనే ఆయన ఆడపెండ్లివారి బృందంలో పెద్దావిడను పిలిచి "అమ్మా! కుర్చీలు మడత పెట్టినారు కదా! అందులో నాల్గవ వరసలో మధ్యలోని కుర్చీలను బాగా వెదకండి." అని చెప్పారట.ఆమె, "బాబుగారూ! మేము అక్కడంతా చూసాము" అని బదులిచ్చింది.సార్ 'ఇంకొక్కసారి చూడమ్మా' అంటూ లేచారట. సార్ చెప్పిన వరుసలోని కుర్చీలను వెదకసాగారు. ఆశ్చర్యంగా మడిచి పెట్టబడిన కుర్చీలను మడత విడదీసినప్పుడు ఒక కుర్చీనుంచి మంగళసూత్రం జారిపడింది. బహుశా త్వరత్వరగా మంగళసూత్ర పళ్ళెము చేతులు మారేప్పుడు ఇది జారిపడి మడతలో ఉండి పోయుంటుంది. ఎవరూ గమనించి నట్లులేదు. ఏమైతే ఏమి కథ సుఖాంతమైంది. పెండ్లికూతురి తల్లిదండ్రుల కన్నుల్లో ఆనందబాష్పాలు. పెద్ద సమస్య నుండి బయటపడినామని గొప్ప ఉపశమనము. తల్లియైతే సార్‌కు నమస్కారము చేసి "అయ్యా! వెంకటేశ్వరస్వామిలా మమ్ము రక్షించారు" అంటూ సంబరముతో కృతజ్ఞతలు తెల్పుకుంది. ఇది అంతా మాస్టరుగారి దయా విశేషము.

జీవితములో సమస్యల నుండి బయటపడి, విడిపడి ఒక్కసారిగా జరిగిన సంఘటనలను కనుక క్రమంగా గుర్తుకు తెచ్చుకుంటే అదనులో నేను చేసిన సహాయ మెంతటిదో మీకు కొంచెము అర్థమౌతుంది" అని మాస్టరుగారు ఉదహరించినట్లు సార్ తరచుగా అనేవారు. ఇలాంటి అపురూప సంఘటనలతో మన జీవితములలోని అపురూప సహాయ సంఘటనలతో మాస్టరుగారి పట్ల మన నమ్మకము, విశ్వాసము మరింత ధృఢమౌతుంది.

## 12. సరళతకు సాకారరూపం

దాదాపు 17 సం॥ల క్రితమనుకుంటాను– సార్‌తో నేను, మా తమ్ముడు తిరుపతి నుండి కుంభకోణం రాత్రి బస్సులో బయలు దేరినాము. సుమారు 9గంటల ప్రయాణం తర్వాత కుంభకోణం చేరినాము. అప్పుడు మాస్టరుగారి ఇల్లు రిపేరులో ఉండింది. అందువలన ఎదురుగా ఉన్న యోగస్కూలులోనికి కాలకృత్యాలు తీర్చుకోవడానికి వెళ్ళినాము. అక్కడ ఉన్న మూడు టాయిలెట్ గదులలోనికి విడివిడిగా వెళ్ళినాము. నేను వెళ్ళినగదిలో కొళాయి తిప్పితే నీళ్ళు రావడములేదు. వెంటనే నేను లోపల నుండి గట్టిగా మా తమ్ముని, పేరుతో పిలుస్తూ టాయిలెట్లో నీళ్ళురావడములేదని, నీళ్ళు తీసుకొని రమ్మని అరుస్తూ చెప్పాను. ఇది ప్రక్క టాయ్‌లెట్లో

**12. Manifestation of Simplicity**

ఉన్న సార్‌కు కూడా వినబడినట్లుంది. ఆయన 'వేణుగోపాల్, నీళ్ళు ఇక్కడున్నాయి. నేను తెచ్చిస్తాను. ఏమీ ఫరవాలేదు'అని అన్నారు. ఇదివిన్న నేను ఎంతో విస్తుపోయాను. ఆయన వయస్సు ఎక్కడ? నా వయస్సు ఎక్కడ? అంత పెద్దమనిషికి అంత పెద్దమనసు ఉంది కనుక అలా స్పందించారు. ఆయన గురుస్థానంలో ఉన్నవారు. ఆయన అంతర్గత శక్తులు, వ్యక్తిత్వ ఔన్నత్యము ఆయన వాసి మొదలగుముందు నేను ఏ మాత్రము లెక్కలోనికి రానివాడను. ఆయన మన్ననయేనా వెనుక బలము. "మనమంతా యోగమిత్రులం. మనమంతా సమానులమే. గురువూ లేదు. శిష్యుడూ లేదు. మనమంతా ఆ మాస్టరుగారి యోగసాధకులమే. వ్యత్యాసము లేదు. భేదములు లేవు" అని చెప్పడమేగాకుండా సహజంగా, సరళంగా చేతలతో ఎలాంటి భేషజాలు లేకుండా ప్రత్యక్ష ప్రమాణ సహితంగా వ్యక్తిగతముగా ప్రవర్తించి సోదాహరణముగా చూపిన మహాను భావుడాయన. చెమ్మగిల్లిన కన్నులతో, వినమ్రత భావముతో ఆయన మంగళ దివ్యచరణాలను స్మరించి, ముద్దిడి నమస్కరించడము కన్నా ఏమి చేయగలము?

## 13. పొరుగింటిలో నీళ్ళుపట్టుట

**తిరుపతిలో నీటిఎద్దడి తలెత్తిందంటే తీవ్రతను గురించి చెప్పడం**

13. Storing Water in the Neighbouring House

చాలాకష్టము. 2003-04 కాలంలో ఈ సమస్య తీవ్రరూపం దాల్చింది. మునిసిపాలిటీ నీళ్ళు ఎప్పుడూ వదులుతుందో, ఎప్పుడు సరఫరా బంద్ చేస్తుందో చెప్పడము కష్టమైంది. ప్రకటిత వేళలు మారడమే గాకుండా, నీటి సరాఫరా పరిమాణము కూడా తగ్గిపోసాగింది. అడపా-దడపా టాంకర్లలో నీరు తెప్పించుకొనడము కూడా ప్రారంభమైంది.

మునిసిపల్ నీటి సరఫరా అర్థరాత్రి, అపరాత్రులలో కూడా జరుగుచుండేది. కాల వ్యవధికి ఒక నియమము లేదు. ఈ సమస్య ఎట్లున్నప్పటికి మా భాగ్యవశాన సార్ ఇంటికి ప్రక్క ప్రక్కనే క్రింది భాగములో అద్దెకు ఇల్లు కుదిరింది. మాకు ఎప్పుడు వీలైతే అప్పుడు రాత్రి గం॥ 9:00ల తర్వాత కూడా మేము సార్ ఇంటిలో కాలము గడిపే వాళ్ళము. అప్పటిలో జరిగిన విషయము తలుచుకుంటే ఇప్పుడు కూడా సార్ యొక్క మహెూన్నత వ్యక్తిత్వము మమ్ములను పులకింప చేస్తుంది. కృతజ్ఞతతో చేతులు జోడించి దివ్యపాదాల వద్ద తల ఉంచాలనిపిస్తుంది. సరే! విషయానికి వస్తే నేను నా భార్య ఇరువురము కేంద్రీయ విద్యాలయములలోచేస్తున్నాము. నా స్కూలు తిరుపతి నుండి 85కి.మీ. దూరంలో అరక్కోణములో ఉంది. నా భార్య స్కూలు తిరుపతి కేంద్రీయ విద్యాలయము. నేనుతరచు డ్యూటీ కొరకై ఉదయము గం॥ 5:00ల రైలులో వెళ్ళేవాడిని.

అప్పటిలో తిరుపతిలో నీళ్ళసమస్య చాలాతీవ్రంగా ఉండుటచే అందరూ కొళాయి కనెక్షన్ క్రింద పది అడుగుల లోతు, నాలుగు అడుగులవెడల్పుఐదారు అడుగుల పొడవు ఉండేటట్లుగాను, లేక కొంచెం హెచ్చుతగ్గుల కొలతలతో వారి వారి సౌకర్యాన్ని బట్టి సంపులు ఏర్పాటు చేసుకొనేవారు. **1-2** గంటల పాటైనా నీరువచ్చిన ఈ సంపు పాతికో అర్ధమో నిండేది. నీళ్ళసమస్య ఎక్కువైన కొలది అందరూ నీళ్ళు మరింతగా ఇబ్బంది లేకుండా ఎక్కువఫోర్సుతో వస్తాయనీ, సరఫరా కాలము తక్కువైనా ఫర్వాలేదు అని అనుకొని కుళాయి కనెక్షన్లను మునిసిపల్ అధికారులకు తెలిపియో, తెలియకుండనో పైపులను క్రిందికి-మరింత క్రిందికి దించడము ప్రారంభించారు. ఒక్కొక్కసారి వానికి బరువులేని తేలికైన రబ్బరుగొట్టాలను కట్టి, క్రిందికి వదదిలేవారు. దీనివలన నీరు మరింత వేగంగా ధారాళంగా వచ్చేవి. అయితే నీటిసరఫరా ఆగిన తర్వాత ఆ పైపుకు కట్టివేయబడిన రబ్బరు గొట్టాన్ని నిల్వఉన్న నీటిమట్టానికన్నా ఎత్తుగా కట్టివేయాలి. లేదంటే నిల్వఉన్న నీరుసైతం వెనక్కి పోయే అవకాశముంది. అట్లా జరిగిన సందర్భాలున్నాయి. ఇంటివాడుకకు నీటిటాంకర్లు తెప్పించుకొని సంపులు, పైన ఒవర్‌హెడ్ టాంకులు, పెద్దపెద్ద డ్రమ్ములు నింపుకొని కొన్నిరోజులు వాడుకున్న సందర్భాలున్నాయి. ఇంటికి అతిథులు వచ్చినా శేషన్నలాగా నీళ్ళు వాడమని కోరేవారము. నీటిఎద్దడి తీవ్రతను స్పష్టము

చేయడానికి ఇంత విపులంగా వివరించడమైంది.

సార్ ఎంతో దయతో ఇంటి బీగముచెవులు ఇచ్చి వెళ్ళమని (ఆఫీసుకి వెళ్ళేప్పుడు) నీళ్ళు వచ్చినప్పుడు తాను పట్టిఉంచుతానని అనేవారు. మాకేమో సంకోచము. మా తల్లిదండ్రులకన్నా వయో ఆధిక్యత ఉన్న పెద్దాయనకు ఇబ్బంది ఎందుకు పెట్టాలని. అయితే చురుకుదనములో, గబగబ ఎక్కడము, దిగడము, భౌతికమైన పనులలో ఆయన యువకుల కన్న ఏమాత్రము తీసిపోయేవాడుకాదు. మిద్దెలను గబగబ నీళ్ళపైపులు పట్టుకొని ఆయన ఎక్కుతుంటే ఆయనకన్న దాదాపు **30-40** సం॥లు చిన్నవారమైన మేము ఎక్కడానికి నానా అవస్థలు పడుతూ ఉండేవారము.

సరే గురువుగా, ఒక పెద్దదిక్కులాగా ఉంటూ అందరి గౌరవాదరాభిమానాలు పొందే ఆధ్యాత్మిక శిఖరములాంటి ఆ అసాధారణ వ్యక్తికి, ఇంటిలో నీళ్ళు పట్టడానికి తాళము చెవులివ్వడము అమర్యాద అని మేము అనుకున్నాము.

ఒకరోజు సాయంత్రం స్కూలు ముగించుకొని వచ్చి సార్ ఇంటిలో మామూలులాగా ప్రార్థనకు సమావేశమైనాము. అక్కడ చేరిన యోగమిత్రులు "ఏమిటండీ! ఇలా చేసారు? సార్‌ను ఎందుకు ఇబ్బంది పెట్టార?"ని ప్రశ్నించారు. "మేమేమి చేసాము? సార్‌కు ఏమి ఇబ్బంది

తెచ్చిపెట్టాము?" అని మథన పడుతుంటే ఒక యోగమిత్రుడు విషయమంతా పూసగుచ్చినట్లు చెప్పినాడు. "భార్యా భర్తలు మీరిద్దరూ డ్యూటీకి వెళ్తారు కదా! ఈ రోజు ఉ॥గం॥11కు నీళ్ళు వచ్చినాయి. గురువుగారు ఇంటిలో నీళ్ళను సంపులో నుండి మిద్దెపైన టాంకులలోనికి కరెంటు మోటరు ద్వారా ఎక్కిస్తూ, ప్రక్కన ఈ సమయములో వీళ్ళు ఇంటిలో ఉండరు కదా! వాళ్ళింటిలో నీళ్ళు పట్టితే బాగుంటుంది- అని అనుకొని మా ఇంటితాళముచెవులు ఇచ్చి ఉంటారను కుంటారనుకొని వానికై వాకబు చేసారట. కాని మేము తాళము చెవులు ఇచ్చి ఉండలేదనే విషయము తెలిసి, పాపము వీళ్ళు నీళ్ళకై ఎంత ఇబ్బంది పడతారో ఏమో అనుకుంటూ ఆయన తన ఇంటి మిద్దెమీదకెళ్ళి అక్కడ నుండి మిద్దెపైకప్పుకి వెళ్ళి అక్కడ నుండి పైపులు అవి పట్టుకొని మా ఇంటి మిద్దెమెట్లు వద్దకు వచ్చి అక్కడ దిగి ఇంటివెనుక సంపును చూసి లోపల అక్కడ రబ్బరు గొట్టముతో కొళాయిపైపు కట్టివేసి ఉ ండడముతో దాదాపు పది అడుగుల లోతున్న సంపులోనికి దిగి ఆ రబ్బరుగొట్టాన్ని విడదీసి నీళ్ళు పెట్టారు. నిజంగా ఆ సంపులోనికి దిగడము, 10-15సం॥ల వయస్సున్న చిన్న పిల్లలకు కూడా ఇబ్బందే. మరి ఈ మహానుభావుడు అంతా చేసి గమ్మున కూర్చున్నాడు. మాటవరుసకకూడా ఏమి అనలేదు. ఎవరో యోగమిత్రులు ఇదిచూసి మిగిలిన వారితో చెప్పితే విషయము బయటపడింది. మాకైతే ఏమి

చెప్పాలో, ఏమి మాట్లాడాలో కూడా తెలియలేదు. మిడిగుడ్లు వేసుకొని మిటకరించి గొంతు పెగుల్చుకొని, "సార్! ఎందుకు మీరు ఇంత శ్రమ తీసుకున్నారు?" అని అడిగితే "మనము యోగా ఫ్రెండ్స్ అండి. అది నా బాధ్యత" అన్నారు. సుగంధముకన్న సువాసనగా, గుభాళించే పరిమళాలకన్నా మిన్నగా, హిమముకన్నా చల్లగా, దివ్యప్రేమ, ఆప్యాయతల నులివెచ్చని ఆనందాన్ని, ఇగిరిపోని మంగళప్రద శుభసమృద్ధి స్మృతుల అనుభూతులను అనుగ్రహించే ఆ చూపులు, తలపులు చెదరనివి, మాయనివి. గుండె లోలోతులలో అవ్యాజప్రేమ తరంగాలను రేకెత్తిస్తుంటాయి. మహాత్ముల, మహానుభావుల ప్రేమ సహజసిద్ధంగా, సరళంగా, నిరాటంకంగా, నిరంతరంగా ప్రతి ఫలాపేక్ష లేకుండా వెదజల్లబడుతుంది. తలచుకొని, తలవంచి నమస్కరించి మహానుభావా! తండ్రీ! అప్పా! మాకు కూడా మీ అడుగుజాడలలో నడచే యోగ్యత, అర్హత ఇవ్వమని ప్రార్థించడము సముచితంగా ఉంటుందనుకుంటాను. విశేష, అశేష దైవానుగ్రహము జన్మాంతం పుణ్యఫల పరిపక్వమో, పూర్వజులా అదృష్టమో మాత్రమే ఇలాంటి మహానుభావుల సాన్నిధ్య సంపర్క సౌభాగ్యము ప్రసాదిస్తుందనుకుంటాను.

# 14. మాస్టరుగారు భౌతికము వదిలినప్పటి సంఘటనలను గురించి విజన్

కొన్ని విషయాలు చిత్ర విచిత్రంగా ఉంటాయి. కల్పనకన్నా యథార్థాల గతిరీతులు పసందుగా, గమ్మత్తుగా ఉంటాయి. సార్ మద్రాసులోని ఎవరికో ట్రీట్‌మెంటుకు, వారి కోరికపై వెళ్ళాలను కున్నారు. బస్సు టికెట్టు కూడా రిజర్వు అయింది. తెల్లవారి క్షురకుడు ఇంటికి వారంలో మామూలు ప్రకారము ఇంటికి వచ్చినారు. తన పని ప్రారంభించారు. గడ్డము గీయడములాంటిది జరుగుతున్నాయి. సార్‌కు హఠాత్తుగా హెర్నియా సమస్య తలెత్తింది. అట్లాంటి కేసు లెన్నింటినో ఆయన ప్రార్థన ద్వారా నయము చేసినారు. సార్ ప్రార్థన చేసుకున్నారు. కాని రిలీఫ్ దొరకడము లేదు. ఎరుకలయ్య శెట్టిగారిని పిలిచి మద్రాసు పయనాన్ని రెండుగంటల తర్వాత సమయానికి రిజర్వు చేయమన్నారు. అంతలో సమస్య సర్దుకుంటుందని యధావిధిగా తన కార్యక్రమాన్ని నెరవేర్చుకోవచ్చని ఆయన భావించారు. కాని సమస్య తీరలేదు. అంతేగాక తీవ్రమైంది. సరే ఇంకచేసేదేమీలేక అప్పుడు వి.వి.మహల్‌కు ఎదురుగా ఉన్న ప్రైవేటు హాస్పిటల్‌లో ఈయనను అడ్మిట్ చేసారు. ఆపరేషన్ అయింది. ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో రెండురోజులుంచినారు.

**14. Vision regarding the Events when Master CVV left his Physical Body**

ఎన్నో గడ్డు సమస్యలను, డాక్టర్లు పెదవి విరిచిన కేసులను, వారికి అలవికాని కేసులను, వారు చేతులెత్తేసి రెకమెండు చేసిన కేసులన్ను, డాక్టర్ల స్వీయ ఆరోగ్య సమస్యలను ఎన్నిటినో సులువుగా పరిష్కరించిన ఈయనకు ఈ సమస్య ఏమిటని మాకు వింతగా అన్పించింది. అయితే ఈ ప్రశ్నకు సమాధానము మరుసటి రోజు దొరికింది. పగలు, రాత్రి అని లేకుండ సమయాసమయములు లెక్కచేయకుండ సార్ యోగమిత్రుల ఆర్తుల సమస్యలను వినేవాడు. సలహాలిచ్చేవాడు. నిజానికి ఆయనకు ఎలాంటి వ్యక్తిగత సమయము లేకపోయింది. ఇంటిలో ఎప్పుడూ యోగమిత్రులు, బంధువులు, ఆర్తులు సలహా సంప్రదింపుల కోసము వచ్చేవారు. వారితో పగులు నుండి రాత్రి పొద్దుపోయేటంత వరకు సరిపోయేది. రాత్రి సమయములలో కూడా ఎన్నో ఫోనులు. చెప్పితే నమ్మరేమో! ఒకసారి సాయంకాలపు సాధారణ ప్రార్థన ముగిసింది. దాదాపు రా॥8:30ని॥ల వరకు యోగమిత్రులు రావడము పోవడము అడగడము, మాట్లాడడము కొనసాగుచునే యున్నది. జనము కొద్దిగా పలచనడినారు.

సార్‌ను యోగ విషయమై ఏదో అడిగినాను. ఆయన "సార్ కొంచెముసేపు ఉండండి. చాలాసేపు నుండి టాయ్‌లెట్‌కు పోవడాన్ని వాయిదా వేస్తున్నాను" అంటూ వెంటనే వెళ్ళినారు. కంచంలో అన్నము వడ్డించి అమ్మగారు కాచుకున్న రోజులెన్నో ఉన్నాయి.

అయితే సార్‌కు ఇంటిలోని గృహిణుల సమస్యలు, వంటింటి సమస్యలు, రాత్రి భోజనాలైన తర్వాత వారు చక్కబాటు చేసుకోవలసిన పరిస్థితులను గురించి కూడా తెలుసు. అయితే యోగమిత్రులు, ఆర్తుల విషయాలలో పైవానిని ప్రక్కన బెట్టేవారు. ఆయన పనులన్ని ఒక పథకము ప్రకారము పద్ధతి ప్రకారము రీతిలో నిర్దిష్టంగా ఉండేవి. ఇంటికి వచ్చిపోయే యోగమిత్రులు, బంధువుల సంఖ్య అధికము గనుక ఇంటికి కావలసిన బియ్యము, పప్పు, కాఫీపొడి, ఇతరములన్ని తగిన మోతాదులో నిల్వలుండేవి. ఆవిన్ పాలపాకెట్లు కూడా చాలా అందుబాటులో ఉండేవి. కూరగాయలు కూడా ఉండేవి. ఆగష్టు సమావేశాలలో ఆయన మరింత శ్రద్ధ తీసుకొనేవారు. యోగమిత్రులలో ఆయన మాస్టరుగారిని చూసుకొనేవారు. సాక్షాత్తు మాస్టరుగారు స్వయముగా వచ్చినప్పుడు ఎలాంటి భక్తిశ్రద్ధలతో మంచి, మంచి ప్రమాణాలతో ఆతిథ్యము ఇవ్వాలనుకుంటామో అదే రీతిలో ఆతిథ్యమివ్వాలని తహతహపడేవారు. తపన పడేవారు. శ్రేష్ఠమైన దినుసులను, సామాగ్రిని ఎన్నుకొని ప్రత్యేకశ్రద్ధతో మాస్టరుగారి పట్ల, శ్రీశాస్త్రిగారిపట్ల తన శ్రద్ధాభిమానాలను వ్యక్తము చేసేటట్లు ఏర్పాటు చేసేవారు. అందరిని సమానంగా చూస్తూ ప్రేమతో పలకరిస్తూ ఎంతో మన్ననతో ఆయన వ్యవహరించేవారు.

ఎప్పటినుండి ఇది ఆరంభమైంది నాకు తెలియదు. ఆ నిద్రాభంగమును ఆయన ఎలా ఎదుర్కొన్నారో, ఆ సహనశక్తి ఎట్టిదో, ఆయన యోగమహాత్మ్య మెట్టిదో, మాస్టరుగారు ఆయనకిచ్చిన అనుగ్రహ విశేషమేమో ఆయనకు, మాస్టరుగారికే ఎరుక. విషయముయొక్క గాఢత అర్థము చేసుకొనడానికి కనీసము **2-3**రోజులు మనము ఈ నిద్రాభంగమును ఆచరణలో ప్రయోగం లాగా అనుభవిస్తే అప్పుడు దీని ఘనత, సంక్లిష్టత అర్థమౌతుంది. రాత్రులు నిద్రా భంగమైందని తెల్లవార్లు పొద్దెక్కేంత వరకు ముసుగుతన్ని పడుకొనేది లేదు. అందరితోపాటి లేచి మామూలుగా కార్యకలాపాలు, సందర్శకులు, సాధకులు, అతిథులు, ఇంటిపనులు, తదితరములతో బిజీగా ఉండుట సహజము. నా అదృష్టము కొద్ది **25**సం॥లు సార్‌తో సన్నిహిత పరిచయము. సార్ ఇంటిలో మిద్దెపైన ఒకటిన్నర సంవత్సరము, ఇంటిలో ఒక సంవత్సరము ప్రక్క ఇంటిలో సుమారు రెండు సంవత్సరాలు ఉండుటచే దగ్గరగా రాత్రులలో కూడా ఆయన వ్యక్తిత్వమును, ఘనతను గమనించే అదృష్టము గల్గినది. ఆయన జీవనము, తెరిచిన పుస్తకము. మాస్టరుగారి యోగానికి, పరోపకారానికి అంకితమైనట్టిది.

తనకంటూ ఏమీ ప్రత్యేకంగా కోరని తత్త్వము. చిన్న, చిన్న విషయాలలో సైతము పరమానందాన్ని అనుభవించే గుణము.

యోగమిత్రుల కోసము ఎంతైనా త్యాగముచేసే బుద్ధి. ఆయనది ఫోనులలో సమయాన్ని వ్యర్థము చేసే మనస్తత్వం కాదు. అలా చేయడం ఆయనకు గిట్టదు. ఎంతవరకు అవసరమో అంతవరకు విషయాన్ని సూటిగా చెప్పాలని గద్దె అంతా అనవసరమని ఆయన భావన. సార్ ఒక కరడుగట్టిన సాంప్రదాయవాది అని చాలామంది భావిస్తారు. కాని ఆధునికతలోని మంచిని కూడా ఆయన ఆదరిస్తారు.

ఈ సందర్భంలో నాది ఒక మాట:- "స్టూడెంట్ నెం.1" సినిమాలోని "ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగి... చదువులమ్మా ఒడిలో" అన్న పాట చాలా బాగుందని మెచ్చుకున్నప్పుడు నేను ఆశ్చర్య పోయాను. ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం పాడిన అన్నమయ్య సినిమాలోని పాటలను ఆయన ప్రయాణాలు చేసేటప్పుడు వినడము చాలా మామూలుగా ఎప్పుడూ జరిగే విషయము. ఆ కాసెట్ లేకుండా కార్లలో ఆయన పయనము చాలా అరుదు. తన గురువైన శ్రీ శాస్త్రిగారు, అన్నమయ్య పాటలను వెలుగులోనికి తెస్తే అవి దేశమంతటా వ్యాప్తి చెందడానికి అన్నమయ్య సినిమా ఉపయోగపడిందని అన్నమయ్య పాటలు విరివిగా వ్యాప్తి చెందాలనుకున్న తన గురుదేవుల కోరిక నెరవేరుచున్నదని అనేవారు. అన్నమయ్య సినిమా వేడుకలు తిరుపతి అన్నమాచార్య మందిరములో కూడా జరిగినాయి. అప్పుడు ఈయన ప్రత్యేక అతిథిగా నిర్మాతతోనూ, నటుడు సుమన్‌లతోపాటు పాల్గొన్నారు.

సరే, విదేశాలలోఉన్న యోగమిత్రుడైన డాక్టరు తనతప్పు లేకుండానే అభియోగాన్ని ఎదుర్కొనవలసి వచ్చింది. అక్కడ మనదేశంలో ఉన్నంత స్వతంత్రము లేదు. ప్రత్యేకంగా విదేశీయులపై నిషేధము కొంచెం ఎక్కువే. ఈయన ఎలాంటి తప్పు చేయనప్పటికీ ఆరోపణలపై అపోహలతో ఈయన దోషికాబడ్డాడు. శిక్ష ఎదురైంది.

ఈయన విషయము సార్‌కి తెలిసింది. ప్రార్థన చేసుకున్నారు. అది ఏమిజరిగిందో ఏమో, మొత్తముపై డాక్టరు సమస్య నుండి బయట పడినాడు. స్వదేశానికి వచ్చినాడు. తన బంధువులను కలుసుకున్నాడు. అయితే ఇంతలో ఎవరివో చెప్పుడుమాటలు విన్నట్టున్నాడు. మనసులో అపోహలు అపార్థాలు తలెత్తినాయి. సార్ వద్దకు వచ్చి తన ఉక్రోషము, ఆక్రోషము, అభాండాలు, చెప్పుడు మాటలు, తనభావాలు అన్నీ క్రుమ్మరించినాడు. సార్ వినినంతసేపు విని తర్వాత ఆయనను లోపలికివెళ్ళి హాలులో కూచుని మాస్టర్‌గారి ఫోటోముందు కూచొని ఆయనకు చెప్పమని చెప్పారట. ప్రేయరు హాలులోనికి వెళ్ళిన ఆయన కొంతసేపటికి బయటకు వచ్చాడు. చెంపలు కంది ఉన్నాయి. ఏమి జరిగిందని అడిగితే సార్‌ను గురించి విషయమంతా మాస్టర్‌గారికి చెప్పాడట. మాస్టరుగారు రెండుచెంపలు వాయించినారని, వెంటనే క్షమించమని కోరాడు. భక్తునికి దైవానికి గల సంబంధము అద్భుతము, అనుపమానము. అది అనిర్వచ నీయము.

## 16. నంది నాగరి శాసనలిపి

సార్ ఓరియంటల్ రీసెర్చి(ప్రాచ్య పరిశోధన) సంస్థలో పండితులుగా పని చేసేవారు. ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ రెండవ ప్రపంచయుద్ధ సమయంలో మద్రాసు నుండి తిరుపతికి వచ్చింది. ఆ సమయంలో తాళపత్ర లిఖిత ప్రతులు ప్రభుత్వ ఉత్తర్వుపై నకలు చేయడము ఆరంభించినారు. ఇతరులతోపాటి సార్ తనపని తాను చేస్తున్న సమయంలో ప్రఖ్యాత పండితుడొకడు శాస్త్రిగారికి బాగా తెలిసినవాడు సన్నిహితుడు ఈయనను చూసి ఈయన చెవులు పట్టుకొని శాస్త్రిగారి వద్దకు లాక్కొని వెళ్ళాడు. సార్‌కు ఆయన ఎందుకు లాక్కొని వెళ్తున్నాడో అర్థంకాలేదు. ఆయన శాస్త్రిగారి వద్దకు తీసుకెళ్ళి "శాస్త్రిగారూ! చూసారా! మీ శిష్యుడేమి చేస్తున్నాడో?" అని ఫిర్యాదు చేస్తున్నట్లు మాట్లాడాడట. శాస్త్రిగారు, సార్ ఏదో పొరబాటు చేసినారని భావించి సర్ది చెప్పడము ఆరంభించారట. "అయ్యా! ఈతను నా శిష్యుడే. బాగా సన్నిహితుడైన వాడు, మంచివాడు, తెలియక ఏదైనా పొరబాటుచేసి ఉంటే దయచేసి మన్నించండ" ని అర్థించారట. ఆయన నవ్వి "పొరబాటు కాదండీ! ఈతడు నిజంగా మీకు తగిన శిష్యుడు. మిగిలిన వారందరు ఒక నకలును ఒకచేతితో వ్రాస్తుంటే ఈ మనిషి రెండు ప్రతులను ప్రక్కప్రక్కన పెట్టి కుడివైపున, అటుచూస్తూ ఎడమవైపున

**16. About Nandi Naagari Inscription Script**

ఇటుచూస్తూ మార్చి, మార్చి కుడి చేతితోను, ఎడమ చేతితోనూ రెండు కలాలతో వ్రాస్తునాడు. ఆశ్చర్యంగా ఉందండి. ఇతడు అసాధ్యుడు" అని అన్నారు. శాస్త్రిగారు మందస్మితులైనారు. శ్రీశాస్త్రిగారు ఆచార్యులగారి నడవడిని, గుణగణములను గమనించి ఆయనపై అపార వాత్సల్యమును కురిపించినారు. జస్టిస్ రాజమన్నార్, ఇతర పండితులతోపెద్దలతో, ప్రముఖులతో పరిచయము చేసేటప్పుడు "నేనెంతో ఈ అబ్బాయి అంత" అని పరిచయము చేసేవారట. సార్ ఆనందంతో తరచూ ఈ మాటలం టుండేవారు. "మా గురుదేవులు శ్రీ వి.పి.ఎస్.గారు నాకు ఇచ్చిన మన్ననచాలా గొప్పది. ఆయన అంతగా నన్ను గురించి చెప్పినప్పుడు నేను ప్రమాణికుడైన వ్యక్తిగా ఉండాలి. ఆయన చెప్పిన స్థాయికి తగినట్లుగా నేను ఎప్పుడూ ఉండాలి. ఆయనపేరు నిలబెట్టడానకి, ఆయన మర్యాద, గౌరవ-ప్రతిష్టలు నిలబెట్టడానికి శాయశక్తులా ప్రయత్నిస్తాను. ఇతర శిష్యులలాగా వేగబాండులాగా నేనుండలేను. ఆయన మాటలు నాకు ఎప్పుడూ గుర్తు ఉంటాయి" అని చెప్పుతూ ఉండేవారు. ఆయన ప్రవర్తనలో శ్రీశాస్త్రిగారి ప్రభావము సుస్పష్టము. ఒకసారి మాస్టరుగారి జయంతి ఉత్సవములో 'కదంబము' చేసారట. అది బాగా వచ్చింది. శాస్త్రిగారు మెచ్చుకున్నారట. అప్పటి నుండి ఆగష్టు ఆధ్యాత్మిక సమావేశపు విందులలో 'కదంబము' తప్పనిసరిగా ఉండేది. శ్రీశాస్త్రిగారు సార్‌తో

"సీసా! పాయిఖానాలు తగినంత సంఖ్యలో లేకుంటే ఇంటివారికేగాక అతిథులకు కష్టము" అనేవారట. సార్ ఇంటిలో తగిన సంఖ్యలో పాయిఖానాలు, స్నానపు గదులు ఉండేవి. "పట్టణాలలో, నగరాలలో ఎవరి ఇంటికైనా మనం అతిథిగా వెళ్ళినప్పుడు ఇంటివారికి ఇబ్బంది కల్గకుండా, వాళ్ళ డ్యూటీకి ఇబ్బంది కలుగకుండా మన స్నాన-పానాదులు, కాలకృత్యాలు తీర్చుకోవాలి. పట్టణాలలో జీవనము సమయానికి ముడిపడి ఉంటుంది. వారు వేచి ఉండేటట్లుచేసి, మనము బాతురూములు వగైరాలలో కాలము గడుపుట సరికాదు. మనవలన ఆతిథ్యమిచ్చిన వారికి ఇబ్బంది కల్గకుండా వారు నిద్రలేచే సమయానికి ముందుగనో, లేక వారి కార్యక్రమాలు అయిన తర్వాతగాని మన కాలకృత్యాలు తీర్చుకోవడము మంచిది" అని శ్రీశాస్త్రిగారు సూచించేవారట. అర్థవంతమైన ఈ సలహాను సార్ యథాతథంగా అమలు పెట్టేవారేనని యోగమిత్రులైన మేము చాలామంది గమనించాము.

సార్, శ్రీవెంకటేశ్వర ఓరియంటల్ రీసెర్చి సంస్థలో పనిచేసేటప్పుడు ఒకానొక సమయములో సంస్థ అధిపతియైన డైరెక్టరుకు, ఆయన అధీనములో పనిచేసే వివిధ పరిశోధక పండితులకు బేధాభిప్రాయాలేర్పడి సంబందాలు కొద్దిగా దెబ్బ తిన్నాయట. సఖ్యత లోపించి ఒకవిధమైన ఇబ్బందికర వాతావరణమేర్పడింది.

వైమనస్యాలతో కొద్దిగా ఎడమొగము, పెడమొగములతో పనిదినాలు గడుస్తున్నాయి. డైరెక్టరుగారు పండితులకు మంచిగుణపాఠము చెప్పాలనుకొని తీర్మానించు కున్నట్టుంది. అందుకని ఒకరోజున హఠాత్తుగా పండితులంతా నిర్ణీత కాలవ్యవధిలో విజయనగరసామ్రాజ్య కాలానికి చెందిన నందినాగరిలిపిని నేర్చుకొని తీరాలని ఆదేశిస్తూ సర్క్యులర్‌ను పంపించారట. సర్క్యులర్‌చూసిన కొందరు పండితులు జావకారి పోయినారు. ఈ నంది నాగరిలిపి ఏమిటి? దీనిని ఎక్కడ నేర్చుకోవాలి? ఈ సర్క్యులర్ ఆదేశాలను పాటించడమెలా? అని వారు తలలు పట్టుకున్నారు. గందరగోళం పడినారు. కొందరూ పరుగెత్తుకుంటూ వెళ్ళి సార్‌కు వర్తమానము చేరవేసినారు. సార్ సర్క్యులర్ రానివ్వండి. నా వద్దకు వచ్చినపుడు నేను చూసుకుంటాను. మీరేమీ చింతించకండి" అని భరోసా ఇచ్చారు. సర్క్యులర్ సాయంత్రం ఈయన వద్దకు వచ్చింది. సార్ అది చూసినారు. డైరెక్టర్‌కు ఒక విజ్ఞప్తి వ్రాసారు. "అయ్యా! ఇది నాకు చాలా సంతోషము కలిగించే విషయము. నేను చాలా సంవత్సరముల నుండి ఈ లిపి నేర్చుకోవాలని ఉబలాట పడుచున్నాను. దయచేసి ఏ పండితుల వద్ద ఏ సమయములో ఎంతకాలము నేర్చుకోవాలో సెలవిస్తే ఆ అజ్ఞలను పాలించుటకు నేను సిద్ధంగా ఉన్నాను. దయచేసి ఆవివరాలను తదుపరి చర్యకై వేగంగా తెల్పండి" అని వ్రాసాడు. విజ్ఞప్తి డైరెక్టర్ వద్దకు వెళ్ళింది. అయితే

ఆ డైరెక్టర్‌కే ఈ విషయాలు ఏమాత్రం తెలియును? నందినాగరిలిపిని ఎవరు బోధిస్తారో ఏమో ఆయనకు ఎరుకలేదు. ఏదో అధికారము చూపించి పరిశోధక పండితులను బెదిరించి తన అదుపాజ్ఞలలో పెట్టుకుందామని తన ప్రతాపము, తడాఖా రుచి చూపిద్దామని అనుకున్నాడు. కాని బంతి తిరిగి తిరిగి తన ఆవరణలోని మైదానములోనికి వచ్చింది. ఏమిచేయాలో తెలియక నిమ్మకు నీరెత్తి పోయినట్లుండిపోయాడు. ఈ ఘటన ఒక ప్రహసనము లాగా మిగిలి పోయింది. పరిశోధక పండితులు లోలోపల నవ్వుకున్నారు.

## 17. ఏటికి ఎదురీత – విద్వాన్ పరీక్ష

సార్ ఒక్కొక్కసారి 'ఇదం బ్రాహ్మ్యం, ఇదం క్షాత్రం" అని పరశు రాముని వలె ఉండేవారు. ఆయన విద్వాన్ పట్టా పరీక్షను సమీక్షిస్తే అది ఒక బృహత్ కథామంజరి. ఆయన వ్యక్తిత్వ ఘనతను, సవాలును సాహసంగా ఎదుర్కొనే నిర్భయతను పట్టుదలను, గురువు దైవానుగ్రహములను సూచిస్తుంది. సార్, శ్రీ శాస్త్రిగారికి ప్రియశిష్యులు. శ్రీ శాస్త్రిగారు యోగానికి జీవితము అంకితము చేసిన తపస్వి. ఆయన సాధన, యోగ పరిపక్వతను బహిరంగ పరుచుకొనుటకు ఇచ్ఛగించేవారు కాదు. వ్యర్థమైన ఆచారాలన్నా, శుష్కమైన వేదాంత డాంభికాలన్న, ఊకదంపుడు తత్త్వ తర్క, వితర్కాలన్న, పటాటోపాలన్న, ఆయనకు



17. Swimming against the Tide – Vidwan Examination

నచ్చేదికాదు. ఆచార సంప్రదాయాలకన్న ఉత్తమగుణాలను ప్రగతిశీలక అధునికతను ఆయన ఇష్టపడేవారు. ఇది ఆనాటి సాంప్రదాయక బృందానికి చెందిన ఆచార్య గణానికి రుచించలేదు. మనస్సులలో ఆయనంటే కొంచెం ఏవగింపు. అయిష్టత. కాని శాస్త్రిగారి పేరు ప్రతిష్టలు, పలుకుబడి చాలా ప్రసిద్ధము. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో పై పదవులలో ఉన్న కొందరు ప్రముఖులకు ఈయనంటే చాలా గురి. చాలా గౌరవము. హైకోర్టు న్యాయాధీశుడుగా, తాత్కాలిక గవర్నరుగా పనిచేసిన పండితుడు, మేధావి జస్టిస్ రాజమన్నార్, అలనాటి ప్రముఖ నటుడు పద్మశ్రీ చిత్తూరు వి.నాగయ్య మొదలగువారు ఈయనపై చాలా గౌరవము చూపేవారు. అందుచేత ప్రాచ్య కళాశాలలోని సంప్రదాయ వాదులు పలుకుబడిగల శ్రీశాస్త్రిగారిని ఏమీచేయలేక ఆయన శిష్యుడైన శ్రీఆచార్యులగారిపై తమ అక్కసుచూపి ఈర్ష్య చల్లార్చుకోవాలను కున్నారు. నిర్ణీత అటెండెన్సు కన్నా తక్కువ ఉండుటచే నోటీసు బోర్డులో, పరీక్షకు అనుమతించబడనివారి పేర్లలో శ్రీ ఆచార్యులగారి పేరు ఉ ంది. సార్‌కు కేవలము రెండురోజులు హాజరుతక్కువ. మనసుపెడితే అది సర్దడము అధ్యాపకులకు కష్టముకాదు. అదేపనిగా ఉద్దేశ్య పూర్వకముగా ఇబ్బంది పెట్టాలనుకొనే వారితో ఏమి చేయగలము? శాస్త్రిగారికి విషయం తెలిసింది. నిర్ణీత హాజరు దినాలకన్నా తక్కువ హాజరు ఉన్నప్పుడు ఛాన్సలర్ హోదాలో ఉన్న గవర్నరుకు వినతి

చేసుకొని ఆయన ఆదేశాలతో కొద్దిరోజుల మినహాయింపు అనుమతిని తెచ్చుకొనే అవకాశముంది. ఇది సాధారణ విషయాలలో, సాధారణ వ్యక్తులతో జరిగేదికాదు. శిష్యునికి సాయం చేయడానికి అది అర్హత కల్గిన కేసు కనుక శ్రీశాస్త్రిగారు ముందుకు వచ్చారు. తనకు తెలిసిన సెనేట్ సభ్యులతో చెప్పి ఈ ప్రత్యేక మినహాయింపు అనుమతిని తయారు చేయించారు. సార్ వ్యక్తిగతంగా వెళ్ళి ఉత్తరము తీసుకొని వచ్చారట. దీనితో మొదటి అడ్డంకి తొలగింది. అనుమతి పత్రము పొందే తతంగానికి చాలాకాలము గడిచింది. పరీక్షకు ఫీజులు కట్టడానికి ఆఖరుతేదీ వచ్చింది. కాలేజి ఆఫీసు, ఫీజు వసూలు చేసుకొనడానికి సమయము ముగిసి పోయింది. ఇక మిగిలియున్న మార్గమేమంటే నేరుగా ట్రెజరీ ఆఫీసులో ఫీజు చెల్లించి రశీదు పొందుట, ఆ రసీదును కాలేజీ నుండి పొందిన పత్రముతో జతపరచి నేరుగా విశ్వ విద్యాలయమునకు పంపడము. ట్రెజరీలో ఫీజు కట్టడమంటే అప్పటిలో చాలా పెద్ద సమస్య. ఎందుకంటే అప్పట్లో ట్రెజరీ ఆఫీసు చంద్రగిరిలో ఉండేది. రవాణా సౌకర్యాలు తక్కువ. అంతేగాక ఆరోజు శనివారము అంటే మధ్యాహ్నము 12 గంటల లోపలనే ట్రెజరీలో డబ్బు జమ చేయాలి. దీనితో రెండో ఘట్టము ప్రారంభమైంది. సార్ తన స్నేహితునితో కలిసి ట్రెజరీలో పైకం జమ చేయడానికి బయలుదేరారు. కాలేజి ఆఫీసు నుండి ఛలాన్లు, అనుమతిపత్రం పొందారు. ఎంత

కష్టపడి సైకిల్ తొక్కినప్పటికీ చంద్రగిరి ట్రెజరీ ఆఫీసు చేరేటప్పటికి మధ్యాహ్నము 12 గంటలు ఐంది. పరుగెత్తుకుంటూ, వగర్చుతూ ట్రెజరీ గదిలోనికి వెళ్ళారు. ట్రెజరీ మూసివేయ బడింది. క్లర్కు లేదు. వీరి అదృష్టము కొలది బంట్రోతు ఉన్నాడు. వీరి గోడు విన్నాడు. దగ్గరలో ఉన్న టీ దుకాణానికి గుమాస్తా సాహెబ్ వెళ్ళినాడని ఆయనను కలిసి సహాయము అడగమని సలహా ఇచ్చాడు. సరే! వెంటనే అక్కడికి పరిగెత్తుకొని వెళ్ళినారు. టీ కొట్టులో గుమాస్తా ఉన్నాడు. వీరి అవస్థను గమనించి "స్వామీ! ఏమీ గాబరా పడకండి. నేను చూచుకుంటాను. టీ తాగి కొంచెం సర్దుకొండి" అని ఆశ్వాసన ఇచ్చాడు. వీరు కొంచెం కుదుటపడినారు. ట్రెజరీ గుమాస్తాఖాతాలో టీ తాగి ట్రెజరీకి వెళ్ళినారు. నిజానికి ట్రెజరీ లెక్కలు, జమా అప్పటికే ముగిసింది. అయినా గుమాస్తా సానుభూతితో దానిని రద్దుచేసి, వీరి ఛలాన్లను స్వీకరించి, పైకమును జమచేసి రసీదు నకలు పత్రమునకు ముద్రవేసి వీరికి అందచేసాడు. దీనితో సకాలములో ఫీజు కట్టడానికి ఉన్న రెండవ అవరోధము తొలగిపోయింది. ఇప్పుడు ఫీజు నకలు కాపీని, కళాశాల అనుమతి పత్రముతో జతపరచి పోస్టులో మద్రాసుకు నిర్ణీత సమయములో పంపడమనే ఘట్టము అరంభమైంది. వీరు ఆదరాబాదరాగా సైకిలులో చంద్రగిరి నుండి తిరుపతికి బయలు దేరినారు. ఎంత త్వరగా సైకిలు తొక్కినప్పటికీ తిరుపతి పోస్టాఫీసు చేరేటప్పటికి పోస్టల్ సమయం

హరించుకుపోయింది. అప్పటికి మిగిలియున్న గత్యంతరమేమంటే రేణిగుంటలో రైల్వేమెయిల్ సర్వీసు ద్వారా ప్రయత్నించడం. అంతేగాకుండా మరుసటిరోజు ఆదివారము. సెలవు గనుక ఏమైనా పోస్టుచేయగలిగితే శనివారము మాత్రమే చేయాలి. సైకిలు రేణిగుంట మార్గము పట్టింది. క్రింద మిందపడి రైల్వేస్టేషను చేరినారు. కాని ఆ వేళకే రైల్వేమెయిల్ సర్వీసు సమయం అయిపోయినది గనుక పోస్టుబ్యాగులన్నీ మూతులు కట్టి, లక్కతో సీలువేయబడి ఉన్నవి. అందులో మద్రాసుకు వెళ్లవలసిన బ్యాగు కూడా ఉంది. ఒకసారి సీలు వేసిన తర్వాత బ్యాగు విప్పడమనేది బ్యాగు చిరునామా కల ఊరులో పోస్టాఫీసు చేరినప్పుడు మాత్రమే. సీలు సరిగా లేకపోతే సంబంధిత ఉద్యోగులపై క్రమశిక్షణ చర్య తీసుకొనే అవకాశముంది. మధ్యలో ఎలాంటి టాంపరింగుకు అవకాశం లేకుండా పోస్టల్‌శాఖ పకడ్బంధీగా చర్యలు తీసుకుంటుంది. పని అంతా దాదాపు ముగింపుదశకు చేరినపుడు ఈ తీవ్ర ఆటంకము. ఏమి చేయాలని సార్ ఆలోచిస్తున్నారు. ఇంతలో సార్‌కు తెలిసిన వ్యక్తి వచ్చాడు. సార్ వాలకము చూచి విషయ మేమిటని ఆరా తీసాడు. దానిని గురించి ఏమాత్రము చింతించవద్దని అంటూ ఆయన అలవాటు ప్రకారము ఈలవేసుకుంటూ పోస్టల్ బంట్రోతుని బాగు తెమ్మని సైగచేసాడు. వీరి కాగితాలని తీసుకొని సనసన్నగా చాలా పలుచని సిగరెట్టులాగా

చుట్టచుట్టినాడు. బంట్రోతు తీసుకొనివచ్చిన బాగుని తీసుకొని దానిని కట్టివేయబడిన మూతిలో తనవద్ద ఉన్న సన్నబీగపు చెవులను మెలమెల్లగా దూర్చినాడు. అది సన్నటి రంధ్రం చేసింది. మెల, మెల్లగా బీగపు చెవులను తీసివేసి సనసన్నగా చాలా పలుచని సిగరెట్టు చుట్టలాగా చుట్టిన కాగితములను బ్యాగులోనికి మెలమెల్లగా జొనిపినాడు. కాగితాలు లోపలికి పోయినాయి. బాగును ఇటు-అటు మెల్లగా పైకి పట్టుకొని కుదిపినాడు. సీలు యథాతథంగా ఉంది. బాగు మూతకూడా గట్టిగా ఉంది. పెద్ద సమస్యకు సులభంగా పరిష్కారము దొరికింది. శ్రీ శాస్త్రిగారి పట్టుపై సంస్కృత విద్వాన్ పట్టా కోర్సును మధ్యలో వదిలి తెలుగు విద్వాన్ కోర్సులో చేరి ఏటికి ఎదురీది పట్టాను సాధించిన ఘనత, కథ శ్రీ ఆచార్యులగారిది. ఇది భవితలో విధిని, కర్మను రద్దుచేసే విధానాన్ని సూచించే సంకేతపూర్వకమైన దైవసంఘటన కాబోలు.

## 18. సునిశిత మేధస్సు-హాస్యము. వ్యంగ్య వైభవము

మాస్టరుగారి యోగ నిబంధనలకు విరుద్ధంగా ఎవ్వరైనా ప్రవర్తిస్తే సార్ వారిని వదిలేవారుకాదు. సునిశితంగా ఎదుర్కొనేవారు. మొహమాటం లేకుండా ఎదురుగానే గట్టిగా చెప్పేవాడు. ఇది కొన్ని ప్రాంతాలలోని యోగమిత్రులకు నచ్చలేదు. ఈయన బోధగురువు కాదు, బాధ గురువు కాదు. నిర్భయంగా సత్యాన్ని వెల్లడించాలనే వ్యక్తి.

**18. Sharp Intelligence – Humorous and Satire Expressions**

ఒక్కొక్కసారి పరుషంగా కూడా మందలించేవారు. అయితే వ్యక్తిగతంగా ఎలాంటి వైమనస్యము లేదు. విషయము వరకు మాత్రమే ఘర్షణ. తగినంత పరిణతి ఉంటేగాని ఇలాంటి వ్యక్తిత్వమును అర్థము చేసుకోలేము. కొన్నిసార్లు అనవసర అపార్థాలు కూడా తలెత్తినాయి. ఒకసారి ఈయనకు వ్యతిరేకంగా విమర్శిస్తూ ఒకరు లేఖ వ్రాసారు. చివరలో వ్యంగ్యోక్తి ప్రదర్శనగా ఏనుగు, కుక్కలు బొమ్మను వేసినాడు. ఇది శ్రీ ఆచార్యులుగారిని కించపరచాలనే ప్రయత్నము. సార్ దీనికి ప్రతిస్పందిస్తూ "మాస్టరుగారు మీ చేత చాలా అర్థవంతమైన బొమ్మ గీయించినాడు. మీలాంటివారి కువిమర్శలను పట్టించుకోకుండా మాస్టరుగారి యోగానికి పూర్తిగా అంకితమైన ఒంటరివాడిని. మందగమనముతో రాచఠీవితో యోగమార్గములో నడుస్తున్న ఏనుగులాంటివాడిని. మరి ఆ బొమ్మలో మీలాంటివారి స్థానమేదో నేను చెప్పనక్కరలేదు" అని వారి వ్యాఖ్యను, అస్త్రాన్ని వారిపై త్రిప్పికొట్టారు.

మాస్టరుగారి ఇంటిసభ్యులకు ఇతోధికంగా సహాయము చేసి, చేయించి కష్టానికి, శ్రమకు ఓర్చుకొని ఎన్నోసార్లు అందుకు వివిధ ప్రదేశాలకు ప్రయాణంచేసి ఆ ఇంటి సభ్యులకు నచ్చచెప్పి ఓపికగా ఎంతోకాలం వేచిఉండి చివరకు మాస్టరుగారి ఇంటిని శ్రీ ప్రభాకర మిత్రమండలి పేరుతో రిజిస్టర్ చేయించిన భగీరథ ప్రయత్నము శ్రీ

ఆచార్యుల వారిది. ఇందుకై ఆయన ఎంత కష్టపడినారో, ఎంత శ్రమించినారో ఆయనతో సన్నిహితంగా మెలిగిన వారికే తెలుసు.

నా కండ్లముందరే జరిగిన ఒక సంఘటన. యోగమిత్రుడైన న్యాయవాది ఒకరు "ఏమండీ! మాస్టరుగారి ఇంటికి మార్కెట్ రేట్ కన్నా ఎక్కువ పైకము మీరిచ్చినట్లుంది" అన్నారు. అప్పుడు ఆయన చెప్పిన మాటలు ఇప్పటికి చెవిలో గింగురుమంటాయి. "మీరు కొన్ని జన్మలెత్తినా నన్ను అర్థము చేసుకోలేరు. ఏమండీ! మనము ఇల్లు అమ్మేటప్పుడు నాల్గు డబ్బులు ఎక్కువ రావాలని అనుకుంటాము. ఇల్లు మనము ఎవ్వరినుండి కొంటున్నాము? మాస్టరుగారి కుటుంబములోని వారి నుండి, వారి సంతతికి చెందినవారి నుండి కదా! వారికి మార్కెట్‌రేటు కన్న కొంచెము ఎక్కువిస్తే ఎంతో సంతోష పడతారు. ఆనందముగా ఇంటిని అమ్ముతారు. కొంచెము వారి స్థానములో వుండి ఆలోచించండి" అన్నారు. 'పరులు తానే అని భావించువాడు అతడే హరిభక్తిని ఎరిగినవాడు...ఏ కులజుడైన ఏమి ఎవ్వరైననేమి' అని అన్నమయ్య కీర్తిస్తాడు. అది ఈ పెద్దయ్యకు చక్కగా సరిపోతుంది.

మణి ప్రవాళశైలిలో దీనిని సార్ ఉదాహరణకు చెప్పుతుండే వారు. మణిప్రవాళ మంటే రెండు భాషల కలయిక. "ఇంట పదిమంది వశంతి, లోన తండూకములెల్ల నశంతి, కుండ బొచ్చెలెల్ల విలసంతి,

రండ కొడుకులెల్ల హసంతి” ఎవ్వరో పేదవాడు. పెద్ద గృహస్థు. ఇంటిలో ఎంతోమంది పరివార సభ్యులు. ఇంటిలో బియ్యము లేదు. వాని పేదరికమును లోకులు గేలి చేస్తున్నారు. ఆ సందర్భములో అతడు చెప్పిన పద్యమిది. ‘రసగంగాధర’ మనే మహాకావ్య రచయిత ‘జగన్నాథ పండిత రాయల’ంటారు. అతడు మొగల్ సామ్రాజ్య సామ్రాట్ ‘షాజహాన్’ కొలువుకూటమును దర్శించినాడని అతనిచే గౌరవ సత్కారాలందు కున్నాడని అంటారు. చాలాకాలము తర్వాత అతడు తన సొంతఊరికి తిరిగి వచ్చినాడట. తన చిననాటి కాలమున ఉన్న పండితులను గురించి వాకబు చేసాడట. వారిలో చాలామంది లేరు. అది నెమరువేసుకుంటూ ఆయన ఈ శ్లోకము చెప్పినాడట. “గతో భీమః గతో జనార్ధనః వ్యాఖ్యాత సూపశంకరః”. భీమాచార్యులు, జనార్ధనుడు మొ॥గు మహాపండితులు దివికేగినారు. ప్రస్తుత పండిత వ్యాఖ్యాన మెవరిదంటే వంటవాడైన శంకరునిది” అని వాపోయాడట. గురువులు, మాస్టర్లు అని స్వయంగా ప్రకటించుకుంటూ, యోగ సాహిత్యమునకు వక్ర వ్యాఖ్యానాలిస్తూ, సాధకులను తప్పు దారి పట్టిస్తున్న వారిని గురించి చెబుతూ శ్రీ ఆచార్యులుగారు ఇది ఉల్లేఖించేవారు. గురువుగారు నిలబడి లఘుశంక తీర్చుకుంటే, వీరు పరుగెడుతూ లఘుశంక తీర్చుకొనే రకమని వ్యంగోక్తి విసిరేవారు. మాస్టరుగారి యోగము ఆయన చెప్పినట్లు చేసుకోక విపరీత వ్యాఖ్యలతో, ఇష్టమైన రీతిలో చేసుకొనుట ఆయనకు సుతారమూ

ఆయనకు నచ్చేది కాదు. మాస్టరుగారంటే మాస్టరు సి.వి.వి ఒక్కరే. మిగిలిన మీడియములలో ఎవ్వరిని అలా పిలవకూడదని ఆయన ధృఢవైఖరి. ఇతర ప్రాంతాలలోని కొందరు యోగమిత్రులకిది నచ్చేదికాదు. వీరి వైఖరితో విసిగిపోయిన ఆయన ఒకసారిలా వ్యాఖ్యానించారు. "దూడలకు, పశువులకు మంచిమేత వేస్తే అది వదిలి ఎక్కడంటే అక్కడ ఏమో తినేరకంగా ఉంది వీరి ప్రవర్తన" అని.

"తండ్రి చెప్పినట్లుగా బిడ్డలు నడచుకుంటే తండ్రి సంతోషంగా తన ఆస్తిపాస్తులు, హక్కులిస్తాడని, అదేవిధంగా మాస్టరుగారు వారి నిబంధనల ప్రకారము మనము నడచుకుంటే ఆయన అనుగ్రహిస్తాడని" సార్ చెప్పేవారు. ట్రీట్‌మెంట్ ఇచ్చే యోగ్యత, శక్తి సామర్థాలను, అర్హతలను గురించి ఒకసారి ప్రస్తావిస్తూ మన దగ్గర రూ॥100/- ఉంటే ఇంకొకరికి ధారాళంగా పది, ఇరవై లేదా ఏభై ఎలా కావాలంటే అలా ఇవ్వవచ్చునీ, మనమే అప్పులో ఉంటే ఎలా సహాయం చేయగలమని ప్రశ్నించాడు.

ఒకసారి ఒక ఆస్ట్రల్‌కేసు విషయమై తమాషా చమత్కార సంభాషణ జరిగిందట. ఒక ఆస్ట్రల్ కేసును శ్రీ వీ.పి.ఎస్.గారు(ఆచార్యులవారి గురువుగారు) కూడా చూసారట. అయితే సమస్య ఎందుకో పూర్తిగా పరిష్కరింపబడినట్లు లేదు. చాలా సంవత్సరాల తర్వాత కేసు

**(This Astral Case Relates to Dr.V.Prabhakar, Second Son of Dr.V.Ramachandra Rao, Principal, S.V.Medical College, Tirupati)**

శ్రీఆచార్యులవారి దగ్గరకు కూడా వచ్చింది. ఆస్ట్రల్, "మీగురువుగారు కూడా నా కేసు చూసినారు. విచారించి నారు" అని సార్‌తో అన్నదట. సార్ ఆస్ట్రల్‌తో "మా గురువుగారు డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ ఆఫీసర్ లాంటి పెద్దవారు. వారి శక్తి, హెూదా ఎక్కువ. నీలాంటి చిన్నవానికి ఆయనలాంటివారి శక్తి అనవసరము. నీలాంటి వారిని అరెస్టు చేయడానికి పోలీసు కానిస్టేబుల్ లాంటి నేను చాలు. నోరు మూసుకొని నీ హద్దుల్లో ఉండు" అని దానితో వ్యవహరించినాడట.

ప్రతివ్యక్తికి ఆస్ట్రల్, ఆత్మ ఉంటుందంటూ సార్ చెప్పే వారు. వ్యక్తి భౌతికము వీడినప్పుడు, పటాసు పేలినప్పుడు వచ్చిన స్పార్క్(నిప్పురవ్వలు) పెద్ద ఆకారము వెళ్ళుతాయని చెప్పేవాడు. ఇది సాధారణ భాషలో చెప్పబడినది. దీనినే తత్త్వభాషలో రవ్వ ఆత్మ అనియు, పెద్ద ఆకారమును ఆస్ట్రల్ లేక సూక్ష్మ శరీరమనీ వ్యవహరించబడుతుంది.

## 19. క్రమశిక్షణ - పి.ఇ.టి. కి దండన

సార్ క్రమశిక్షణ గల వ్యక్తి. హృదయము ఎంత ఆర్ద్రతకలిగి ఉంటుందో క్రమశిక్షణలో అంతే ఖచ్చితంగా ఉండేవారు. క్రమశిక్షణను పాటించనివారు ఎంత స్నేహితులైనా, పెద్దలైనా తప్పును ఎత్తి చూపెడివారు. ప్రార్థన జరిగేటప్పుడు మౌనము పాటించడము తప్పనిసరి

**19. Discipline – Punishment to the P.E.T.**

ఆయనకు నచ్చేది కాదు. మాస్టరుగారంటే మాస్టరు సి.వి.వి ఒక్కరే. మిగిలిన మీడియములలో ఎవ్వరిని అలా పిలవకూడదని ఆయన ధృఢవైఖరి. ఇతర ప్రాంతాలలోని కొందరు యోగమిత్రులకిది నచ్చేదికాదు. వీరి వైఖరితో విసిగిపోయిన ఆయన ఒకసారిలా వ్యాఖ్యానించారు. "దూడలకు, పశువులకు మంచిమేత వేస్తే అది వదిలి ఎక్కడంటే అక్కడ ఏమో తినేరకంగా ఉంది వీరి ప్రవర్తన" అని.

"తండ్రి చెప్పినట్లుగా బిడ్డలు నడచుకుంటే తండ్రి సంతోషంగా తన ఆస్తిపాస్తులు, హక్కులిస్తాడని, అదేవిధంగా మాస్టరుగారు వారి నిబంధనల ప్రకారము మనము నడచుకుంటే ఆయన అనుగ్రహిస్తాడని" సార్ చెప్పేవారు. ట్రీట్‌మెంట్ ఇచ్చే యోగ్యత, శక్తి సామర్థాలను, అర్హతలను గురించి ఒకసారి ప్రస్తావిస్తూ మన దగ్గర రూ॥**100/-** ఉంటే ఇంకొకరికి ధారాళంగా పది, ఇరవై లేదా ఏభై ఎలా కావాలంటే అలా ఇవ్వవచ్చునీ, మనమే అప్పులో ఉంటే ఎలా సహాయం చేయగలమని ప్రశ్నించాడు.

ఒకసారి ఒక ఆస్ట్రల్‌కేసు విషయమై తమాషా చమత్కార సంభాషణ జరిగిందట. ఒక ఆస్ట్రల్ కేసును శ్రీ వీ.పి.ఎస్.గారు(ఆచార్యులవారి గురువుగారు) కూడా చూసారట. అయితే సమస్య ఎందుకో పూర్తిగా పరిష్కరింపబడినట్లు లేదు. చాలా సంవత్సరాల తర్వాత కేసు

సర్వీసులలో చివరి సర్వీసు జరుగుతున్నది. గేము పాయింటులో వీరి టీము ఉన్నది. ఆ పాయింట్ వస్తే గేము గెలిచినట్లు. లేకుంటే సర్వీసు మారిపోతుంది. ప్రత్యర్థి టీము ఐదు సర్వీసులు పొందుతారు. అప్పుడు వీరికి గెలుపు చాలా కష్టము. గేము తారాస్థాయికి చేరుకుంది. ఎదుటివారి నుండి బంతి తీవ్రమైన వేగముతో వచ్చింది. సార్ అది ఔట్ అని అంచనావేసి త్రుటిలో తోటి సహ ఆటగాళ్ళకు ఔట్ అని కాషన్ ఇచ్చాడు. ఇలా కాషన్ ఇచ్చినప్పుడు వారు ఎలాంటి రియాక్షన్ (ప్రతిస్పందన) చూపకుండా శాంతంగా ఉండాలి. అయితే ఉపాధ్యాయుడు కాషన్ పట్టించుకోకుండా బంతిని తిరిగి బాల్ బ్యాడ్మింటన్‌తో కొట్టి ఎదుటివారి కోర్టులోనికి పంపడానికి ప్రయత్నము చేశాడు. అయితే సరియైన సమయములో స్పందన లేకపోవుటచే అలా చేయలేక పోయాడు. బంతి బయటకు వెళ్ళి పడింది. ప్రతిస్పందన చూపకుండా శాంతంగా ఉంటే పాయింట్ లంభించేది. ఆట గెలిచేవారు. కాషన్ ఇచ్చినప్పుడు అది తప్పుగాని ఒప్పుగాని పాటించి తీరాలనేది ఆటగాళ్ళకు అవసరమైన కనీసపు క్రమశిక్షణ. ఒకవేళ బంతి లోపల పడితే, బాధ్యత కాషన్ ఇచ్చేవారిదయ్యేది. కాని ఇప్పుడు క్రమశిక్షణ ఉల్లంఘించచడము అనే రెండు పెద్ద పొరబాట్లుకు దారితీసింది. మొదటిది చేజేతులా గెలిచే అవకాశము కోల్పోడవము. రెండవది ఎదుటి టీముకు ఐదుహాండ్లు గల సర్వీసు లబ్ది పొందే

అవకాశమివ్వడము. తద్వారా వారికి గెలిచే అవకాశమివ్వడము. ఎంతో ఉత్కంఠతో సాగుచున్న ఈ ఆటలో ఇలా గెలిచే అవకాశము కోల్పోవుటను ఆటగాళ్ళు జీర్ణించుకోలేక పోయారు. అందులో ఆటల్లో, క్రీడల్లో ప్రత్యేక నైపుణ్యం గల ఫిజికల్ ఎడ్యుకేషన్ టీచర్(పి.ఇ.టి) ద్వారా(వలన) గెలిచే అవకాశము కోల్పోవడమనేది మరింత బాధకు గురిచేసింది. ఆటలో పూర్తిగా తాదాత్మ్యం చెందిన సార్‌కు చాలా కోపమొచ్చింది. పి.ఇ.టి. పై అందరూ తీవ్రంగా విరుచుకుపడ్డారు. సార్, పి.ఇ.టి. దగ్గరకు వెళ్ళి బ్యాటుతో రెండు పీకాడు. దీనితో కళాశాలంతా గందరగోళంగా తయారైంది. రెండు వర్గాలుగా చీలినారు. విషయము ఆచార్యులవారి గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారికి తెలిసింది. ఆయన సార్‌ను పిలిచి, ఇద్దరి మధ్య సంధి కుదర్చడానికి చాలా ప్రయత్నించారు. సార్ చేత పి.ఇ.టి కి క్షమాపణ చెప్పించడానికి ప్రయత్నించారు. ఈయన ఒప్పుకోలేదు. తాను చేసింది తప్పుగాదనీ, అది ఆటకు సంబంధించిన ప్రతిచర్యనీ, అది సరైనదనీ, అందుచే క్షమాపణ చెప్పననీ చెప్పారు. ఆ ఆటలో పి.ఇ.టి యొక్క చర్య చాలా గొప్ప తప్పిదమనీ, అందుకే అలా చేసాననీ సార్ అన్నారు. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి ఏమి చేయాలో అర్థంగాలేదు. సార్ పైన వత్తిడి తేవడానికి తాను ఉపవాసదీక్ష ఆరంభించాడు. ఇది శ్రీ రామాంజనేయ ఘర్షణలా తయారైంది. మిత్రులు, ఉపాధ్యాయులు,

ఇతర పురప్రముఖులు సార్‌కు నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. ఈయన ససేమిరా తగ్గేదిలేదని ఖచ్చితంగా చెప్పారు. ఆట విషయం వేరని, గురువు(శ్రీ శాస్త్రి)గారిపై భక్తి శ్రద్ధలు వేరని, అందుచేత దానికి దీనికి ముడి పెట్టడము సరికాదని తేల్చి చెప్పారు. మధ్యవర్తులు చేసేదేమీ లేక శ్రీ వి.పి.ఎస్. గారికి నచ్చజెప్పారు. సార్‌కు పట్టు విడుపులు లేవని కాదు. అయితే ఆయనకు అసంగతము అన్పిస్తే దానిని స్వీకరించేవాడే కాదు. క్రమశిక్షణలో రాజీపడుటను ఆయన సహించేవాడు కాదు. ఇంటిలోకానీ, బయటగానీ ప్రత్యేకముగా ఇది ఉండి తీరాలనే నిబంధన లేదు. సమయానికి ఏది ముఖ్యమో, ఏది లభ్యమో దానిని సంతృప్తిగా తీసుకొనేవాడు. ఆయన వ్యక్తిత్వము నిరాడంబరమనే స్వర్ణప్రకాశముతో వెలుగుతూ ఉండేది.

## 20. ఆర్ద్రార్ద్ర హృదయము

మాస్టరుగారి యోగములో ట్రీట్‌మెంటుకు సముచిత ప్రాధాన్యమున్నది. ట్రీట్‌మెంటు చేసి కృతకృత్యుడై లభించిన ఉత్తమ పుణ్యఫలములో కొంచెము చేసిన వ్యక్తికి కొంచెము యోగాలైనుకు అందుతుందని మాస్టరుగారు సాహిత్యములో వ్రాయబడి ఉన్నది. ట్రీట్‌మెంటు విషయంలో సార్‌కు అసాధారణ ప్రజ్ఞా విశేషాలున్నాయి. ఇది ఎంతోమంది యోగమిత్రుల స్వానుభవము. ఎన్నో సంవత్సరాల

**20. Heart with Sympathy for the Distressed**

నుండి అవస్థపడుచూ అనేక వైద్యాలు, మందులు, మూలికలను తీసుకుంటూ ప్రత్యేక వైద్య నిపుణులను తరచుగా కలుసుకుంటూ చికిత్స దీర్ఘకాలము పొందియూ లాభము పొందనివారు ఎంతోమంది ఆయనతో ఒక ప్రార్థన(ట్రీట్‌మెంట్ ప్రేయర్) చేయించుకుని ఎంతగానో చక్కబడడము ఎంతోమంది యోగమిత్రులకు ప్రత్యక్ష అనుభవము. దీనికి వెనుకఉన్న రహస్యమేమని ఆరాతీస్తే వచ్చే జవాబు శ్రీ ఆచార్యులుగారి ఆర్ద్రార్ద్ర హృదయము. ఎదుటివారి కష్టాలను చూచి ఈయన లోలోపల తీవ్రంగా అనుకంపనకు గురియయ్యేవాడు (ఫీలయ్యేవాడు). తమ సమస్యను ఆయనకు విన్నవించుకుంటే ఇక ఈయన దాని వెనుక పడేవాడు. భాగవతములో రంతిదేవుడు "కోను సస్యాత్ ఉపాయోత్ర ఏనాహం సర్వదేహినం ప్రవేశస్య సతతం దుఃఖ భాగుబక్" అని ఆలోచించేవాడట. అంటే "నేను సర్వదేహుల లోనికి ప్రవేశించి వారికి బదులుగా వారిబాధలు పొందేమార్గము ఉందా?" అని అర్థం. ఇలా రంతిదేవుడు అహర్నిశము తపించేవాడని తెలియ వస్తున్నది. ఈ భాగవతోత్తముడు కూడా తనను అర్థించిన వారిని మాస్టరుగారి ద్వారా శ్రీ వి.పి.ఎస్. గారి ద్వారా ఆర్తుల బాధల తొలగించడానికి, వెంటనే ఉపశమనము ఇప్పించాలని తీవ్రంగా తపించేవారు. అసలు వారికంటే వీరి అనుకంపన ఎక్కువగా ఉండేది. సమస్యను గురించి గానీ, అస్వస్థతను గురించిగానీ చెప్పిన తర్వాత

తదుపరి దాని విషయము ఏమి జరిగినదో, పరిస్థితి ఎలాఉందో చెప్పేవరకు ఈయనకు ఆదుర్దా. కొందరు ఆయనకు తమ సమస్య విన్పించి తర్వాత ఏమైనదో తెలుపకుండా దినాలు, వారాలు గడిపేవారు. ఈయనే తిరిగి(మరలా) వారికి ఫోనుచేసి విషయము కనుగొన్న సందర్భాలు (సంఘటనలు) ఎన్నో ఉన్నాయి. ఎంతో కఠినమైన సమస్యలను, అనారోగ్యములను ప్రార్థనతో స్వస్థత పరచినపుడు కొందరు ఘనాపాఠీలు కనీసపు కృతజ్ఞత లేకుండా ప్రవరిస్తే కొందరు యోగమిత్రులు వారి ప్రవర్తనపట్ల నొచ్చుకుంటుంటే శ్రీవారు ఎలాంటి వ్యాఖ్యానము చేయకుండా ప్రశాంతంగా ఉండేవారు. మాస్టరుగారి యోగఘనతను మరింతగా తెలుసుకొనుటకు ఇది ఉపయోగ పడిందని వ్యక్తుల ప్రవర్తనతో తనకు నిమిత్తలు లేదని చెప్పేవారు.

ఈయన ఉద్యోగంచేసే సంస్థలోని కొందరు సహచరులకు ఈయన ధృఢవైఖరి, నిర్భీతి, సత్యాన్ని సూటిగా చెప్పడము ఇతరులకు అసమంజస ప్రవర్తనను, చెడువర్తనమును ఎత్తిచూపుట కొందరికి నచ్చేదికాదు. సత్యానికి, ధర్మానికి తప్ప వేరే దేనికి కట్టుబడక పోవడము ఈయన స్వభావము. సహచరులలో కొందరికి ఈయన స్వభావము. సహచరుల ప్రవర్తనలో కొందరు పొరబాటు చేసినప్పుడు ఈయన తన మనఃసాక్షి ప్రకారము నడచుకుంటూ క్రిందిస్థాయి ఉద్యోగులను సమర్థించినాడని తమకు మద్దతు తెలపలేదని గుర్రుగా

ఉండేది. ఈయనపై అనేకరకాల వత్తిడి తేవడానికి వారు ప్రయత్నించారు. ఏదో ఒక వంక పెట్టాలని చూస్తుండేవారు. ఇలాంటి సమయములో ఈయనంటే సుతారాము గిట్టని ఒక సహోద్యోగి అకస్మాత్తుగా ఒక తీవ్ర ప్రమాదానికి గురియైనాడు. ఆయన సన్నిహితులైన సహోద్యోగులెవరూ ఆయన సహాయానికి రాలేదు. విషయము ఎట్లనో సార్‌కు తెలిసింది. వెంటనే ఆగమేఘాలపై వెళ్ళి సహాయానికి పూనుకున్నాడు. తిరుపతిలో చాలినంతగా ఆ విషయములో వైద్య సదుపాయములు లేకపోవుటచే అతనిని దాదాపు 100కి.మీ. దూరములో ఉన్న వేలూరు సి.ఎమ్.సి. వైద్యశాలలో చేర్పించినారు. ఆయన త్వరగా రికవరి కావడానికి అన్నిరకాలుగా సాయం చేసినాడు. తాను ఆచార్యులవారిని ద్వేషించినప్పటికీ, ఆయనకు విరుద్ధంగా కుతంత్రాలు చేసినప్పటికీ, క్లిష్టసమయాల్లో తన సన్నిహిత మిత్రులకన్నా, బంధువులకన్నా మిన్నగా సార్ చేసిన సహాయము, చూపిన ఔదార్యము ఆయన కళ్ళలో నీళ్ళు తెప్పించాయి. ఆయన పూర్తిగా కోలుకోగానే(రికవరీ) వైషమ్యాలు వదిలి స్నేహంగా దగ్గర కావడానికి ప్రయత్నించాడు. సార్ ఆయనతో మానవతా దృక్పథంతో తాను సాయము చేసినానని అంతకు మునుపు ఆయన చేసిన తప్పిదాలను తాను అంగీకరించనని ఆయన ప్రవర్తన నడవడిలో నిజమైన మార్పు రావాలనీ, అంతవరకూ ఆయన మార్గం ఆయనది,

తనదారి తనదని సున్నితంగా చెప్పాడట.

సాధారణంగా సాధకులు ప్రార్థన(ప్రేయర్) తర్వాత ఒకరి తర్వాత ఒకరు వచ్చి నమస్కారము చేసుకొని విభూతి తీసుకొనేవారు. ఒక్కొక్కసారి సార్ నుదుటిపై విభూతి పెట్టి కొంచెం విభూది ఇచ్చేవారు. కొందరు సార్‌పై గౌరవముతో కాళ్ళకు నమస్కారం చేసేవారు. ప్రతిగా చేతులతో నమస్కారము చేయడమో, ఆశీఃపూర్వకముగా తలను లేక వెన్నును స్పృశించేవారు లేక మాస్టరుగారికి నమస్కారము చేస్తూ, ఆయన పటము చూచేవారు. కొందరు యోగమిత్రులకు ఈ పాదాభివందనం నచ్చలేదు. సార్ ఒకసారి జనాంతికముగా "యోగ మిత్రులు నాకు నమస్కారము చేస్తున్నారనే భ్రమ నాకు లేదు. అది అంతా మాస్టరుగారికి, గురుదేవుల వారికి చెందుతుంది. మాస్టరుగారి సంపుటి దివ్యాక్షరముల అనుగ్రహము పనిచేయకపోతే ప్రజలు ఉతికి అరేస్తారు"అన్నారు. ఈ సమయములో కంచి పరమాచార్య శ్రీ చంద్రశేఖర సరస్వతిగారు చెప్పిన విషయము గుర్తుకొస్తున్నది. ఆయన "మామీద ప్రేమతో, భక్తితో, గౌరవముతో భక్తులు, శిష్యులు, ప్రజలు మాకు నమస్కారము చేస్తారు. మేము వెంటనే దానిని దైవానికి సమర్పించాలి. మేము అలా చేయకపోతే పాపము చుట్టుకొంటుంది. లగేజి మోసినవానికి, కూలీచేసిన వానికి కనీసము కూలి ముట్టుతుంది. మాకు ఒనగూడేది లేదు. పైపెచ్చు మీరు అప్పుచెప్పిన వెంటనే అంటే నమస్కరించిన వెంటనే దానిని

దైవానికి ఒప్పగించకపోతే మాకు సమస్య" అని అన్నారు.

ఒకసారి సాయంకాల ప్రార్థన(ప్రేయర్)లు ముగిసి నాయి. ఎంతోమంది ప్రార్థనకై వచ్చినారు. సార్ తెల్లవారి నుండి రాత్రి ఎనిమిది గంటల వరకు కూడా సాధకులతో తలమునకలై ఉన్నారు. రాత్రి ఎనిమిది గంటల తర్వాత కొద్దిసేపు కొందరికి విభూతి ఇచ్చి, ఏకబిగిన గంటలకొద్దీ కూచొని ఉండడంచేత కాళ్ళకు కొద్దిగా రిలాక్సేషన్ ఇవ్వడానికి, సరైన రక్తప్రసరణకై కాళ్ళు చాపి కొద్దిగా పడుకున్నారు. సాధకులతో అవీ, ఇవీ మాట్లాడుచున్నారు. ఇంతలో వయస్సులో పెద్దగా ఉన్న ఒకామె సార్‌ను సమీపించింది. ఆమె కొద్దిగా భారీకాయపు మోస్తరు. కదలడము కొంచెం కష్టం. అయితే సార్‌పై ఉన్న భక్తికొలది కొంచెం కష్టమైనా సరే వంగి శరీరాన్ని వంచి సార్ రెండుకాళ్ళకు నమస్కారం చేయాలని ఆమె ప్రయత్నించింది. సార్‌కు విషయం అర్థమైంది. ఆమె ఇంకా వంగీ-వంగక మునుపే హఠాత్తుగా రెండుకాళ్ళను కొద్దిగా పైకెత్తి హలాసనభంగిమలో ఉండి ఆమెచేతులతో నమస్కారం చేయడానికి వీలు కల్పించాడు. ఆమె ఎంతో సంతోషపడుచూ చేతులతో ఆయన కాళ్ళను తాకి నమస్కరించి వెళ్ళింది. ఈ విషయం బాహ్యదృష్టికి చాలా సాధారణమైన మామూలు విషయమన్పించినా, సరిగా అవగాహన చేసుకుంటే ఆయన ఆర్ద్రార్ద్ర హృదయము తెలుస్తుంది. సాయబు కొండ దగ్గరికి వెళ్ళకుంటే, కొండే

...యు దగ్గరికి రావాలని తమాషాగా నవ్వుతూ అన్నాడు. ఆ నవ్వును ...చేసుకుంటే దివ్య మధుర దరహాస తటిల్లతలా అన్పిస్తుంది. ...ంగా, సరళంగా, దివ్యంగా, సరసంగా అలా నవ్వడమనేది ఆధ్యాత్మిక లోతులందుకున్న మహాత్ముల లక్షణం కాబోలును.

మాస్టరుగారి మీడియములలో ప్రతిఒక్కరిని గురించి కూడా ఈయన ఆలోచించినాడని ఏదో మాటల సందర్భములో ఇది ...యటపడింది. జనుల సాధారణ సమస్యలైన నీటిఎద్దడి(వాన ...డకపోవడము) మొదలగు వాటిని గురించి కూడా ఆయన జన బాహుళ్యానికి తెలియకుండా, ఆర్భాట ప్రచారాలకు దూరంగా ఉండి తీవ్రంగా ప్రార్థన చేసేవారు. అది ఒక రకమైన గాఢ తపస్సు, ఇక సాధకులు, యోగమిత్రులు వారి కుటుంబ సభ్యులను గురించి సరేసరి. ఎక్కడో(వందల కి.మీ. దూరంలో) ఉన్నప్పటికినీ సార్‌తో కొద్ది క్షణాలైనా తరచు మాట్లాడడమనేది సాధకులకు, వారి కుటుంబ సభ్యులకు సర్వ సాధారణమైన విషయము. ఆయన మాటలు వింటే అది ఒక ఆనందము. ఆశ్వాసన, భరోసా, ఉత్సాహం. నేను బొంబాయిలోను, ఓజర్‌లోనూ, బీదర్ జిల్లాలోను పనిచేస్తున్నప్పుడు కుటుంబానికి చాలా, చాలా దూరంగా ఉండుటచే వ్యక్తిగతంగా, మానసికంగా ఇబ్బంది ఉండేది. ఆయనతో కొద్దిసేపు మాట్లాడితే నిరుత్సాహము తొలగిపోయి, ఉత్సాహంపొంగి పొర్లేది. ఒకసారి బొంబాయి నుండి ఫోను చేసాను.

రాత్రి తొమ్మిది గంటల పైన ఫోను. సంగీతము తదితరముల ద్వారా ప్రజలకు, భక్తులకు ఆరోగ్యాన్ని అందించాలని యత్నిస్తున్న ఒక స్వామీజీ వాహనం ప్రమాదానికి గురియైనాదని తాను వార్తలలో విన్నానని, ఆయనకు వేగమే ఆరోగ్యము కుదుట బడాలని ప్రార్థన చేద్దామని ఆయన అన్నాడు. ఆ స్వామీజీ తన యోగమార్గానికి చెందనప్పటికీ, ప్రజలకొరకై ఆయన తాపత్రయ పడుచున్నాడని అందుకోసమే ఆయన స్వామీజీ కొరకై ప్రార్థన చేస్తున్నాడని అర్థమయింది. తోటివారి బాగుకై ప్రయత్నించే వారందరికీ శ్రీ ఆచార్యులుగారు మద్దతు ఇచ్చేవారని నాకు అర్థమైంది. ఒక్కొక్కసారి సాధకుల బంధువుల, హితుల యోగ క్షేమాలు ఒకరి నుండి ఇంకొకరికి ఆయన ద్వారా తెలిసేది. మేము, మా అన్నదమ్ములు, కుటుంబసభ్యులు, మా మాటలలో సార్ అని శ్రీ ఆచార్యులగారిని గురించి ప్రస్తావిస్తూ ఉంటే, ఇది విన్న ఒక బంధువు, సార్‌ను నేరుగా తెలియనివారు ఆయనెవరో మహానుభావుడు ఈ కాలములో కూడా ఉన్నాడే, కష్ట-సుఖాలు పంచుకుటున్నాడే అని ఎంతో గౌరవముతో సంతోషముతో శ్రీ ఆచార్యులవారి గురించి మాట్లాడినారు. సార్ ద్వారా మాకు విభూది పొట్లాలు తరచుగా లభ్యమయ్యేవి. ఇవి కుంభకోణములో ప్రార్థనా స్థలములో, గదిలో ఉంచి తీసుకు వచ్చేవారు. యోగాన్ని గురించి, సార్‌ను గురించి ఎరుకలేని మా బంధువులు కూడా వీనిని వాడేవారు. దీన్ని వాడి తలనొప్పి, మోకాళ్ళనొప్పులు

తగ్గాయని ఈ ప్రత్యేక విభూది ఏ ఊరిలో, షాపులో దొరుకుతాయని వాకబు చేసేవారు. నేటికాలములో సెల్‌ఫోన్లు, లాండ్‌ఫోన్ల హడావుడు ఎక్కువ. ఫోన్లతో సమస్య లేదు. 1980-85 ప్రాంతంలో స్థితిగతుల గురించి ఇదివరకే ప్రస్తావించాను. అప్పట్లో ఫోన్లో దూరప్రాంతాలకు లైన్లు దొరకడము, దూరంగా ఉన్నవారితో మాట్లాడడమనేది ఒక గొప్ప విషయం. గొప్ప అనుభూతి. వందలమంది యోగమిత్రులు(సాధకులు), వారి కుటుంబసభ్యులు, సమస్యలు, ఇంటి విషయాలు ఈయన మెదడులో నిక్షిప్తము. ఒకరకమైన హెడ్‌క్వార్టర్స్. కంప్యూటర్, ముఖ్య సమాచార కార్యాలయములోని విశిష్ట గదిలాంటిది ఆయన మెదడు. అప్పటికప్పుడు ఎవరికి ఏది అవసరమో, ఎంతవరకు అవసరమో అంతవరకు విషయాలు, హామీలు చలనులలో నీరులాగా స్వచ్ఛంగా ఉబికి వచ్చేవి. ఇటువంటి దానినే శ్రీ శాస్త్రిగారు ప్రవచనాలలో అమృత స్పందనమని పేర్కొన్నారని నా తలంపు. (చూ. ప్రభాకర ప్రవచనములు)

## 21. స్వగతము - అంతర్బహిశ్చ

అది బహుశా 1987వ సం॥రం. శ్రీ ఆచార్యులగారితో కొద్ది,కొద్దిగా ప్రత్యక్ష పరిచయము. మా పెద్దమ్మ కుమారుడు శ్రీరామమూర్తి, శ్రీ ఆచార్యులగారి బృందముతో తిరుపతి నుండి కుంభకోణము వెళ్ళి వచ్చినాడు. ఆయనే శ్రీ ఆచార్యులను గురించి,



**21. Introspection – Inner and Outer Feelings**

ప్రజ్ఞా ప్రభాకరమును గురించి చాలా చాలా చెప్పినాడు. శ్రీ ఆచార్యులవారు, ఎరుకలయ్యగారు, ఇతర యోగమిత్రులతో కలసి మదనపల్లికి వచ్చినారు. అప్పుడు శ్రీవారిని గురించి కొద్దిగా తెలుసుకొనే భాగ్యము ఏర్పడింది. వారిని చూస్తే ఏదో సంతోషము. గౌరవించాలన్పిస్తుంది. శ్రీ శాస్త్రిగారి శిష్యులని ఒక ప్రత్యేక ఆదరణ. శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి గద్యరచన ఒకటి మేము మా తొమ్మిదవ తరగతి తెలుగు పాఠ్య పుస్తకములో 'ఆంధ్రుల కల్పవృక్షము' అనే దానిని చదువుకున్నాము. ఆ పాఠము తాటిచెట్టును గురించి, దాని ఉపయోగాలను గురించి వివరణ ఇచ్చింది. అయితే కల్పవృక్షమంటే కోరిన కోర్కెలు తీర్చే దివ్యవృక్షము. ఈ పంక్తులు వ్రాస్తుంటే నాకు "మాస్టరుగారి యోగాన్ని తన శిష్యుని ద్వారా మా లాంటి సాధకులకు అనుగ్రహించి శ్రీ శాస్త్రిగారే కల్పవృక్షమైనాడని నాకు అన్పిస్తుంది. ఈ విషయం సరే. మా పెద్దనాయన ఇంటిలో మిత్రులందరు ప్రార్థనకు సమావేశము అయినాము. మాస్టరుగారి యోగములో సాధకులందరిని ఫ్రెండ్స్ అని వ్యవహరిస్తాము. మాస్టరుగారు కూడా తమ శిష్యులను ఫ్రెండ్స్ అని సంబోధించేవారట. ఇది సాధారణ సంప్రదాయానికి భిన్నంగా అన్పిస్తుంది. సరే ప్రార్థనకు అందరూ సమావేశమైనాము. అప్పట్లో నాకు 'ఇస్నోఫీలియా' ఉండేది. శ్వాస పీల్చుకుంటుంటే శబ్దాలు వచ్చేవి. ఒక్కొక్కసారి శ్లేష్మము ముక్కులో నుండి సరిగారాక ఇబ్బంది

పెడుతుండేది. ఈ కూతలు, శబ్దాలు ఒక్కొక్కసారి నాకే కాక నా ప్రక్కనున్నవారికి కూడా అసౌకర్యము కల్గించేది. ఇది సరే ఆరోజు సాయంత్రము ప్రార్థనకు కూర్చున్నాము. నా అదృష్టము కొద్దీ నేను శ్రీవారి సమీపములో ఉన్నాను. 15 నుండి 20మంది వరకు ప్రార్థనలో కూర్చున్నాము. కొంతసేపటి తర్వాత నా ఇబ్బంది మొదలైంది. కూతలు, శబ్దాలు మొదలైనాయి. "అయ్యో! నా ఈ శబ్దాలు ఇతరుల ధ్యానానికి అవరోధమై, వారిని ఇబ్బంది పెడుతున్నాయ"ని నాలో ఫీలింగ్. కానీ పరిస్థితి నా అదుపులో లేదు. ఇంతలో హఠాత్తుగా శ్రీవారి చేయి నెమ్మదిగా నా వెన్నుపై నుంచి క్రింది వరకు నిమరసాగింది. లోపలనున్న కఫము ఆ చేయి నిమురుతున్నప్పుడు నాకు తెలియకుండానే ఇమిరి పోతున్నట్లు, ఆవిరి అవుతున్నట్లు అనుభూతి కల్గినది. అతి త్వరలోనే నా శ్వాస సర్దుకొన్నది. కూతలు, శబ్దాలు నిలిచిపోయాయి. నిశ్శబ్దము. అసలు ఇదంతా నిజంగా ఇంత త్వరలో జరిగిందా? నమ్మశక్యం కాకుండా ఉందే! ఇదేమిటి? అని తికమక, ఆశ్చర్యము, ఆనందము. ఒకరకంగా ఉబ్బితబ్బివుతూ ప్రార్థన కాగానే శ్రీ ఆచార్యులవారి పాదాలకు నమస్కారము చేసాను. ఆయన విభూది ఇచ్చారు. దాని తర్వాత 'ఇస్నోఫీలియా' అనే సమస్యనాకు ఒకప్పుడు ఉందనేవిషయం మరచిపోయాను. అన్నిటికీ శ్రీవారు ఉన్నారు కదా! అనే ధీమా.

అది 1985వ సం॥ నవంబరు నెల కాబోలు ఒకనాటి రాత్రి హఠాత్తుగా విరేచనాలు మొదలైనాయి. కొంతసేపటికి వాంతులు కూడా ఆరంభమైనాయి. 'పూర్వాషాఢ, ఉత్తరాషాఢ' అసలు ఒకటే నాలుగయిదుసార్లు వస్తే మనిషిని కుదేలు చేస్తాయి. ఇక రెండూ కలిస్తే చెప్పేదేముంది! బాగా నీరసపడి పోయినాను. శక్తి తక్కువ ఎలాగో రాత్రంతా అవస్థ పడినానుఉదయము ఇబ్బంది పడుతూ సార్‌ని దర్శించి బాధను చెప్పుకున్నాను, సరే మాస్టరుగారికి ప్రేయర్ చేసుకోండి. విగర్ సప్లై చేయమని కోరండి. అని సలహా ఇచ్చారు. సరే నేను అలాగే ప్రార్థించాను. కొంతసేపటికి నా కడుపులో అలజడి సర్దుకొంది. కొంచెము నెమ్మదించింది. ఓపిక వచ్చింది. అయితే కొద్దిగా శరీరములో వేడి అయినట్టు అన్పించింది. కొద్దిగా జ్వరము, తలనొప్పి వచ్చినట్లనిపించింది. సార్‌ని ఇదేమిటి అని అడిగాను. ఆయన చిరుమందహాసంతో "అందుకే మాస్టరుగారు, సాధకులకు ప్రాథమికంగా అయిననూ అనాటమీ, ఫిజియాలజీ, వైద్యము మొ॥వి తెలిసిఉండాలి" అన్నారు. ఎవరికైనా వాంతులు, విరేచనాలు మొదలైనపుడు ఆసుపత్రిలో చేరిస్తే వెంటనే వారు మొదలుపెట్టే వైద్యమేమంటే సెలైన్ ఇవ్వడం- "సెలైన్ ఇస్తే శరీరములో వేడి పెరగడానికి అవకాశముందని" డాక్టర్లు అంటున్నారు. తంత్ర శాస్త్రములో కూడా శక్తిని ఉన్నత భూమికల నుండి గ్రహించినప్పుడు తల యొక్క నుదురుభాగము, వెనుకభాగం,

ధన-ఋణ ధృవాల వలే పనిచేస్తాయని శరీరములో రెండు విభిన్న చైతన్యస్థాయిలు కలిసినపుడు కొద్దిగా అస్తవ్యస్తమై తర్వాత సర్దుకొంటుందని, ఈ ప్రక్రియలో కొద్దిగా తలనొప్పి రావడానికి, శరీరములో ఉష్ణోగ్రతలో మార్పురావడానికి అవకాశముందని తంత్రశాస్త్రము తెలిసిన యోగ నిష్ణాతులు తెలిపినారు.

అలాగే **1992**వ ప్రాంతంలో నేను మైసూరుకు వెళ్ళినాను. అక్కడ నాకు వైరల్ జ్వరమొచ్చింది. రెండు, మూడు రోజులు అవస్థ పడినాను. మందులు వేసుకున్నాను. జ్వరం తగ్గింది. బెంగుళూరుకు తిరిగివచ్చి ఉద్యోగానికి హాజరైనాను. కాని నీరసముగా ఉండేది. నోటికి ఏమి రుచించేదికాదు. ఏ ఆహారము తీసుకొనడానికి మనస్కరించ లేదు. ఏమి చేయాలో తెలియలేదు. సరే సార్ కు ఫోన్ చేసినాను. పరిస్థితి వివరించాను. ఆయన అభయమిచ్చాడు. "ఏమీ ఫరవాలేదు! మొదటి ముద్దలో కొద్దిగా విభూది తీసుకొని కలిపి తినండి. తర్వాత ఆహారము తీసుకొనగలరు" అన్నారు. ఆయన ఆదేశము ప్రకారము అలాగే చేశాను. అంతే వెంటనే సాఫీగా ఇబ్బందిలేకుండా ఆహారము లోపలికివెళ్ళసాగింది. అది శ్రీవారి నోటిపలుకు ఘనత. విభూది మహాత్మ్యము. మాటే మంత్రమా?

మెలకువస్థితిలో మనము జాగరూకతతో ఉంటాము. స్వప్నావస్థ విచిత్రమైంది. ఒకసారి రాత్రినిద్రలో కల వచ్చింది. అది మంచికలకాదు.

నైతికముగా పతనమగుతున్నట్లు తోచుచున్నది. కాని నామీద నాకు నియంత్రణ(అదుపు) లేదు. దానిని తప్పించుకోవాలని కూడా తోచడము లేదు. ఇబ్బంది పడుచున్నాను, మాస్టరుగారిని తలుచుకోవాలని కూడా అనిపించడము లేదు. అది మంపర లేక జడత్వమో తెలియదు. అయోమయస్థితి. ఇంతలో హఠాత్తుగా మహానుభావుడు శ్రీవారు(శ్రీ ఆచార్యులవారి) సాక్షాత్కారము. ఆకార పరిమాణము పెద్దది. అది నేను కోరదగినది, సమయోచితమైనది, అత్యంత ఆవశ్యకమైనది, కావాల్సినది, నేను అర్థించకుండానే నా సమస్య, కలత ఎరిగి సరియైన సమయంలో దర్శనమిచ్చి రక్షించిన ఉద్ధారకుడాయన. అన్నమయ్య చెప్పినట్లు "గారవించి దప్పిదీర్చు కాల మేఘమా(ము)! తోడై నడచి రక్షించే దివ్యౌషధమా(ము)! చెడనీక బ్రతికించే సిద్ధమంత్రమా(ము)! పడిబాయక తిరిగే ప్రాణబంధువా(వు)! నా చిత్తములోని శ్రీనివాసుడా!(డు)"

ఏ.వి.ఎస్. అనే శ్రీ ఆచార్యులగారి పేరు యొక్క సంపుటి అనగా ఇనిషియల్స్‌ను గురించి నాకు ఏమనిపిస్తుందంటే శ్రీవారి గురువు శ్రీ వి.పి.ఎస్.(శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు) గారు, వారి గురువుగారైన మాస్టరు(శ్రీ కంచుపాటి వెంకట్రావ్ వెంకాసామిరావు) గారు, మాస్టరుగారు, ఎం.టి.ఎ. గారిని తమ గురువులన్నారు. ఈ విషయము వారి డైరీలలో వ్రాయబడి ఉన్నది. శ్రీ ఎం.టి.ఎ., సి.వి.వి., శ్రీ

వి.పి.ఎస్. అనే ఈ ముగ్గురు గురుమూర్తుల నామ సంపుటిలోని వరుస క్రమములో చివరి అక్షరాలను కల్పితే అనగా ఏ.వి.ఎస్. అనునది శ్రీ ఆచార్యులవారి నామ సంపుటి అవుతుంది. మాస్టరుగారి పత్నియైన మాతృశ్రీ వెంకమ్మగారి నామ సంపుటి, మాస్టరుగారి నామ సంపుటి ఒక్కటే. శ్రీ ఆచార్యులవారి నామ సంపుటి, వారి అర్థాంగి యొక్క నామ సంపుటి రెండూకూడా ఒకటే. ఇది ఖచ్చితంగా ఒక విశేషమని, ప్రత్యేక గమనార్హమని నా దృఢ అభిప్రాయము. సార్‌కున్న దివ్యదృష్టి(యోగ దృష్టి / సైట్/ జ్ఞాన దృష్టి) ని గురించి శ్రీ శాస్త్రిగారు శ్రీ ఎస్.ఆర్.బి.వి. కి వివరించారట. అప్పుడు శ్రీ ఎస్.ఆర్.బి.వి.గారు, మాస్టరుగారు దివ్యదృష్టి ఒసగిన మీడియములందరికీ అనుగ్రహించబడిన సైట్‌ను ఉపసంహరించారనీ, బహుశా ఈయన మాస్టరుగారు సైట్‌ను వెనక్కి తీసుకొననప్పటి కాలానికి చెందిన మాస్టరుగారి పూర్వశిష్యుడై ఉంటాడనీ అన్నారట. అణువులోని రహస్యమును గురించి మాస్టరుగారు తనకు చూపించినారని శ్రీ ఆచార్యులవారు తన చిన్న పాకెట్ డైరీలలో వ్రాసుకొన్నారు. అనుకోకుండా అది సాకంట పడింది. సార్ విశేష యోగానుభూతులను గురించి చాలా చాలా క్లుప్తంగా, ఎప్పుడోగానీ బయటపడేవారుకాదు. యోగుల, మహాత్ముల గతులు, సంగతులు అపారము, అగాథము, అనంతము.

What is meant by Direct Line?:-

**1.9.1914 8.05**pm నుండి **8:15**pm వరుకు Instructions:

ఇది శ్రీ P.S. జగదీశ్ అయ్యర్ మీడియం నెంబరు **60** పందమంగళం వాస్తవ్యులు **18-5-1913** లో చేరినవారు వ్రాసినది.

Direct Line అంటే ఏమిటి?

Direct అంటే స్వయంగా ఉత్పత్తిచేయు శక్తి కలది అని. అంటే ఇతర సహాయం లేకుండా సృష్టించగల శక్తి కలది అని అర్థం. అందుచేతనే ఈ Direct ను Creative Line అని అనడం జరిగింది. దీనినే స్వతంత్రముగా సృష్టించగల మార్గము అని కూడ పేర్కొనడం జరిగింది.

ఇంతవరకు జరిగిపోయిన ఆరుగురు మనువుల కాలములోను, ఇప్పటి ఏడవ మనువు కాలములోను ఏడుగురు బ్రహ్మలచేత సృష్టించబడిన ఈ ప్రపంచసృష్టి అంతా ఇతర సహాయము తో ఏర్పాటు చేయబడినది. అంటే స్త్రీ / ప్రకృతి సహాయముతో జరిగినదన్నమాట.

ఈ సృష్టులన్నీ నిజమైనవికావు. ఇవి Origin నుండి పుట్టినవికావు.

Origin కు స్వయంగా పుట్టించే శక్తి ఉంది. అది ఊహకు అందనిది. అందుచేతనే దీనిని Independent Line అని పేర్కొనడం జరిగినది. Independency ని చూపింది. అంటే ఇప్పటి సృష్టి పద్ధతిని, గడచిన సృష్టుల పద్ధతులను అనుకరించకుండా స్వతంత్రముగా సృష్టించింది అని అర్థము.

సృష్టి రెండు రకాలు. ఏదో ఒక సహాయాన్ని పొంది సృష్టించేది మొదటిది. ఇది ఎక్కడో నిల్వ ఉన్నదాని సహాయాన్ని పొంది సృష్టించేది.

స్వతంత్రముగా సృష్టించేది రెండవది. ఇది ఇండిపెండెంట్ మార్గము.

స్వంత ఊహాశక్తితో సృష్టింపబడేది.

ఈ ఇండిపెండెంట్ మార్గము ఇచ్ఛామాత్రసృష్టియని అర్థము. ఈ ఇచ్ఛామాత్రసృష్టి ప్రపంచములో స్పష్టముగా అందరికీ తెలియాలి. అది ముందుముందు స్పష్టముగా తెలుస్తుంది.

ఈ ఇచ్ఛామాత్రసృష్టి కుండలిని నిర్ణయానుసారముపైగానీ, త్రిమూర్తుల శక్తిపైగానీ ఆధారపడదు. ఇది స్వతంత్రమైనది. కాబట్టే ఇచ్ఛామాత్రసృష్టిని Independent Creative Line అని అనడం జరిగింది. ఈ ఇచ్ఛామాత్రసృష్టిని బాహ్యప్రపంచపు ఒత్తిడులు ఏవీ నాశనం చేయలేవు. Direct Line లో Independency ని స్పష్టముగా తెలియజేయవచ్చును. ఈ ఇచ్ఛామాత్రసృష్టికి జగత్తు యొక్క సహాయము అవసరము లేదు.

దివ్యదృష్టులను సంపాదించడము, ప్రాణదానము చేయడం వగైరాలు ఎన్నో సంవత్సరాల తపస్సు చేస్తేగానీ, ఇతరమార్గాలలో లభించదు.

ఈ నూతన మార్గములో ఎన్నోసంవత్సరాలు కష్టపడకుండా Short-cut Route లో అంటే తక్కువ వ్యవధిలో దివ్యదృష్టులను సంపాదించవచ్చును. ప్రాణదానాన్ని చేయవచ్చును. అందుకే అభివృద్ధిపరచి ఈ Direct Line ను ఏర్పాటు చేయడం జరిగింది.

శ్రీ మాష్టరుగారి Direct Medium అయిన శ్రీ ప్రభాకరశాస్త్రిగారి పద్యాలలో కొన్నిటిలో మాస్టర్‌గారి యోగాన్ని గురించి, అందులోని విశేషాలను గురించి, యోగసాహిత్యాన్ని గురించి, మాస్టరుగారి ఘనతను గురించి అంతర్లీనంగా పేర్కొనడం జరిగింది. అందులో కొన్ని పద్యాలలోని యోగ విశేషాలను చూచాయగా వివరించడానికై ప్రయత్నిస్తున్నాము. సాధనలో ఇవి సాధకుల వికాసానికి ఎంతో సహాయపడతాయని నా భావము.

శ్రీ మాస్టరుగారు ఈ యోగములో ఏ ఒక్కడూ విడిగా కడతేరజాలడు అని పేర్కొన్నారు. ఈ యోగలక్ష్యము సమస్త మానవాళి అభ్యుదయము. నిరాకారమైన చిన్మయతత్త్వము యొక్క సాకారము శ్రీ మాస్టరుగారు. అంటే సుగుణ నిర్గుణములు రెండూ మాస్టరుగారిలో కలిసిఉన్నాయి. ఒక మీడియంకు వ్రాసిన ఉత్తరములో శ్రీమాస్టరుగారు "మీరు కావాలనుకొంటే నా Photo ను పెట్టుకోండి" అని వ్రాసారు. అంటే Photo ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే. Photo ఉంటే సుగుణం. లేకుంటే నిర్గుణం. అనంతమైన దివ్య చైతన్యశక్తిని ఒక నిర్దిష్ట ఆకాశములో మాత్రమే భావించడం సరియైనది కాదు. శ్రీ మాస్టరుగారు "నేను సదా నీలో ఉందును. నీకు కావాల్సిన సహాయము లో నుండి జరుపుదును", అని అన్నారు. ఇది సర్వత్రా వ్యాపించియున్న చిన్మయతత్త్వమును సూచించుచున్నది.

కవితాశిల్పము సల్పగా దొలుత వేడ్కల్ రేగె నాకున్, గృతుల్
చివురొత్తెన్, వెస మోము మొత్తె, నిక నాచే జెల్ల వీ కల్ల బొ
ల్లి వినోదంబు, లివే జరామరణముల్, చీడల్ హతం బార్చి, పు
ట్టువు చెట్టున్ సఫలీకరించుకొని యంటున్ గట్టెదన్ మాలినై.

కవిత్వము వ్రాయడము అనేది గొప్పవేడుకగా నాకు ముందు అనిపించింది. కొన్ని కవితలు వ్రాసాను. ఇప్పుడు వాటిపై నాకు వెగుటు పుట్టింది. ఈ కల్లబొల్లి వినోదములపై ఆసక్తిలేదు. ఇవి చెల్లవు. జరామరణములనే చీడలను నాశనము చేసి నా జన్మ(పుట్టు) అనే చెట్టును సఫలీకృతము చేసికొని తోటమాలిలాగా అంట్లు కట్టెదను. ఈ యోగము జరా వ్యాధి మరణములను అధిగమించాలని, భౌతిక శరీరములో భగవంతుని కుండలిని ప్రజ్ఞ ద్వారా చైతన్యావస్థలో సాక్షాత్కరింప చేసుకోవడము అంతరాత్మ ప్రబోధం ద్వారా సందేహాలు

నివృత్తి చేసుకోవడమనే లక్ష్యము కల్గిఉన్నట్టిది ఈయోగము. ఎలాంటి మినహాయింపులు లేక షరతులు లేకుండా (జాతి కుల మత దేశ భాషా భేదములకు అతీతముగా) సర్వమానవుల శ్రేయస్సుకై ఉద్దేశించబడినది. శాస్త్రిగారు యోగము బాగా వ్యాప్తి కావాలని అందరూ యోగముద్వారా బాగుపడాలని తాను కూడా ఈ యోగమును వ్యాప్తిచేయుటకై యత్నిస్తున్నానని ఈ పద్యములో సూచిస్తున్నారు.

క్షణక్షణము సత్యజ్ఞాన సంతోష సంపత్సంగతిన్ బొంగుచుండన్
చణమయి విలసిల్లెన్ స్వాంతమున్ దిద్దుకొమ్మా
ప్రణుతిపరత దప్పం బాయగా నేరనన్నా
అణువణువున నాలో నైక్యముం జెందు తండ్రీ.

"తండ్రీ! ప్రతిక్షణము సత్యజ్ఞాన సంతోష సంపదలు అనే సంగతులు పొంగుచుండగా మెరుపువలే ప్రకాశించునట్లు లోలోపలనుండి నన్ను దిద్దుకో. నమస్కారము చేయుట అనే పద్ధతిని నేను తప్పను. అణువణువులో నాతో ఐక్యము చెందుము". ఇచ్చట శాస్త్రిగారు యోగసాధన గురించి మాస్టరుగారిని ఎలా ప్రార్థించాలో, ఏమి కోరాలో తెలియజేస్తున్నారు. 'స్వాంతమున్ దిద్దుకొమ్మా' అని అనడంలో Rectification అనునది లోలోపల నుండి జరగాలి అని కోరుచున్నారు. లోలోతులలో ఉన్న మహత్తరమైన దివ్యశక్తి సరిచేస్తూ బయటకు ప్రకటితము కావాలి. ఇది చాలా మార్మికమైన సూక్ష్మాతిసూక్ష్మమైన విషయము. ఎందుకంటే అణువణువులో లోలోపల అంతరాళములలో మహత్తరమైన ఆధ్యాత్మిక దివ్యశక్తి దాగిఉంది. అది క్షణక్షణము సత్యజ్ఞాన సంతోష సంపదలనే సంగతులను వెల్వరచుచూ ప్రకాశమయమై వ్యక్తమైతే వ్యక్తికి, సృష్టికి కూడా అనంత పరమానందాన్ని ఇస్తుంది. మాస్టరుగారు Fire Proof Body అని పేర్కొన్నారు. ఈ

ప్రకాశమైన ఆకారము దానిని సూచిస్తుంది. ప్రణుతి పరత తప్పనుఅనుటలో మాస్టరుగారి యోగసాధన గురించి ప్రస్తావించడం జరిగింది. ఈ యోగములో నమస్కారముద్ర రావడం అనేది యోగశక్తి చేకూరుటకు ఒక చిహ్నము. సీనియర్ సాధకులు నమస్కారము చేసుకొందామా అని యోగసాధన ఆరంభించడానికి ముందు అడగడం కద్దు.

ఆసల్‌రేపంగ నంతరంగపు టరణ్యం బంధకారమ్మునన్
దాసోహమ్మని చొచ్చితిన్ వెదక నంతర్యామి నాలో నెదో
భాసిల్లెన్ జిఱువెల్గు చేరంజన దా వమ్మయ్యె నా యగ్నిలో
నే సోహమ్మయి నిల్చితిన్ బిదప నేదీ నాతనం బయ్యెడన్.

"అంతర్యామీ! ఎంతో ఆశతో నీవే దిక్కని భావిస్తూ అంతరంగమనే అరణ్యపు చీకటిలో ప్రవేశించి, వెతకగా ఏదో ఒక చిన్న వెలుగు కనబడినది. దాని సమీపమునకు వెళ్ళగా ఆ అగ్నిలో నేను అనునది వ్యర్థము అయిపోయినది. నేను అనునది లేకుండా పోయినది".

యోగంలో సాధకునికి జిజ్ఞాస ఉండాలి. అంటే పరమాత్మ కుతూహలత్వం. తెలిసికోవాలనే తపన ఉండాలి. అదే ఆశ కలిగి ఉండాలి. అంతర్ముఖంగా పరిశీలించాలి. దీనినే మాస్టరుగారు Deep Inner Observation అన్నారు. శరీరమును క్షుణ్ణంగా అంతర్ముఖంగా పరిశీలిస్తే ఎన్నో ఆధ్యాత్మిక రహస్యాలు తెలుస్తాయి. పరమాత్మతో సన్నిహిత సంబంధం ఏర్పడుతుంది. భక్తి-శ్రద్ధ-ఆరాధన-సన్నిహితత్వము ఎక్కువైయ్యే కొలది, నేను-నాది అను భావము క్లుప్తము అవుతుంది. లుప్తము అవుతుంది. అంతా ఆ దైవమే అనే భావన రూఢి అవుతుంది. ఇది యోగసాధకులు

అలవరచుకోవలసిన అభ్యాసము. ఆచరణలోనికి రావలసిన అనుభవము.

దూరంబేల పరంబు నీ విహమునందున్ భక్తరక్షార్థ మ
ర్త్యా రూపంబు ధరించి యుంటివన నిచ్చల్ నిన్నె లోకన్ను చె
న్నారం గాంచెద దేహదేవకుల మూలాధార మం దాసహ
స్రారంబున్ సుఖసత్య చిత్కలిత దీపారాధనల్ సేయుచున్.

ఆ పరతత్త్వము దూరము లేకుండా ఇచ్చటనే భక్తులరక్షణ కొరకై మానవాకారముతో నీ రూపములో వెలసినది. నిత్యము అంతర్దృష్టితో స్పష్టముగా మూలాధారము నుండి సహస్రారము వరకు సుఖమైన-సత్యమైన-చైతన్యమైన దీపారాధన చేయుచూ చూచెదను. సమస్త దైవాలకు నీవే మూలాధారము. ఇచ్చట పరతత్త్వము మాస్టరుగారి రూపములో మానవాకారము ధరించినది అని మానవులలోని మూలాధారము నుండి సహస్రారము వరకు ఆ చైతన్యశక్తియే వ్యాప్తి చెంది యున్నదని, దానిని ఆరాధించవలెనని శాస్త్రిగారు పేర్కొన్నారు.

చక్షుర్గోచరమైన యీ జగతికిం జాటై యనేకాద్భుత
ప్రేక్షాలక్షిత మెంతయేన్ గలదు, తద్విజ్ఞాన సర్వస్వమున్
లక్షింపం దగు శక్తి మర్త్యులకు గల్గన్ లేదు; యద్దాన; ప్ర
త్యక్షంబైనది నీ కొకింత; యట మాటై యింక నేమున్నదో

"కంటికి కనబడే ఈ ప్రపంచానికి మరుగున చూడదగిన అనేకాలైన అద్భుతాలు ఎన్నో ఉన్నాయి. ఆ విజ్ఞాన సర్వస్వమును చూడగల్గినటువంటి శక్తి సాధారణ మానవులకు లేదు. అందులో ఒక రవ్వంత నీకు కనబడింది. దీనికి మాటుగా ఇంకా ఎంతో ఉన్నది". ఇచ్చట శాస్త్రిగారు అదృశ్య వివిధ భూమికలు గురించి లేక Planes గురించి సూచిస్తున్నారు. శ్రీ మాస్టరుగారి యోగసాహిత్యములో

మహాపరనిర్వాణిక్ పరనిర్వాణిక్, నిర్వాణిక్, బుద్ధిక్, మెంటల్, ఆస్ట్రల్, ఫిజికల్ అనే భూమికలను గురించి ప్రస్తావించారు. మహాపరనిర్వాణిక్ సహస్రారముగాను, Physical మూలాధారముగానూ చెప్పవచ్చును. ఇంకా మాస్టరుగారి యోగసాహిత్యములో కుండలిని is rivetted in the soul of Feet అని పేర్కొనబడింది. ఇది సాధారణ ఊహలకు అందని విషయము.

పరమాణువునకు లోపలదాగు సూక్ష్మాత్మా
దయసేయవే సూక్ష్మ దర్శనంబు
బ్రహ్మాండమునకు బైఁపడి వెల్గు పరమాత్మా
దయసేయవే పరదర్శనంబు;
అఖిలంబు నం దభివ్యాపించు విశ్వాత్మ
దయసేయవే విశ్వదర్శనంబు
ఏకమయ్యు ననేకమై వెల్గు నేకాత్మా
దయసేయవే యైక్య దర్శనంబు
గ్రుడ్డిఎద్దు చేనబడ్డట్టు లిటునట్టు
కానలేక ఎట్టొ కడచుచుంటి
ఆదుకోవె! సచ్చిదానందపదమీవె
నాథ! నన్ను నిన్నొనర్చుకోవె!

ఈ పద్యములో పరమాణువుకు లోపల పరతత్వము సూక్ష్మముగా ఉన్నదని ఈ బ్రహ్మాండమునకు వెలుపల పరమాత్మ వెలుగుచున్నాడని సమస్త చరాచరసృష్టిలో పరమాత్మ స్వరూపమైన విశ్వాత్మ వ్యాపించి యున్నాడని, పరతత్వము ఏకమై కూడా అనేక రూపముల భాసించుచున్నదని ఆ సూక్ష్మదర్శనము, పరదర్శనము, విశ్వదర్శనము, ఐక్యదర్శనమును అనుగ్రహించి సచ్చిదానంద పదవి ఇవ్వమని

శ్రీశాస్త్రిగారు వేడుకొనుచున్నారు. గుడ్డిఎద్దు సరిగా చూడలేకుండా చేనులో పడి అటూ ఇటూ తిరుగుతూ అవస్త పడుచున్నట్లుగా తన పరిస్థితి ఉందని, తన్ను ఆదుకోమని ఆర్తితో శ్రీశాస్త్రిగారు ప్రార్థిస్తున్నారు. ఆధ్యాత్మిక పథములో ముందు-ముందుకు సాగుటకు వికాసము పొందుటకు తీవ్రమైన తపన, భగవంతుని అనుగ్రహము అవసరము. అవి లేకుండా ముందుకు సాగలేము. సాధకులు ఆధ్యాత్మిక వికాసమునకై తపనతో భగవంతుని అనుగ్రహముకై తపించాలని ఈ పద్యము ద్వారా అర్థమగుచున్నది.

సీ.వీ.వీ. కరుణాకటాక్షములు రక్షించున్ సదా తన్మయం
బై వర్థిల్లెడు భక్తియున్నయెడ నిత్యానంద మారోగ్య మా
హా పుట్టించెడు ప్రజ్ఞ ఈ త్రయము లభ్యంబౌను తార్కాణ నే
నే వేయేటికి? మీర లిందరును దీనిం జక్క గుర్తింపరో!

సదా తన్మయమై వర్థిల్లుచున్న భక్తి కనుక శ్రీ మాస్టరుగారిపట్ల ఉండే ఆయన కరుణ అనుగ్రహములు ఎల్లప్పుడు మనల్ని రక్షిస్తాయి. నిత్యానందము ఆరోగ్యము విశేషమైన ప్రజ్ఞ ఈ మూడు ఆయన అనుగ్రహముచే లభ్యమగుతాయి. దీనికి తానే ఉదాహరణ అని, అందరు దీనిని స్పష్టముగా గుర్తించాలని శాస్త్రిగారు ఈ పద్యములో పేర్కొనుచున్నారు. యోగసాధన ఫలితము అనుభవైకవేద్యము.

